# మళ్ళీ మళ్ళీ పుడతా...


రచన

**డా॥ వాసా ప్రభావతి**

హైదరాబాదు

ఫోన్ : 4549178



జయంతితే సుకృతినో రససిద్ధాః

**జయంతి పబ్లికేషన్స్**

దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 60

# MALLEE MALLEE PUDATHAA

by

**DR. VASA PRABHAVATHI**

First Edition
**March 1997**
Second Edition
**May 2002**
Cover Design
**Seela Veerraju**

Price
**Rs. 60 /-**

For Copies
**Smt. J. Meenakshi**
'Vasa Nilayam' 11 / 2 RT,
Municipal Colony, Malakpet,
Hyderabad - 500 036.
Ph. 4549178
&
**Visalaandhra Publishing House, Hyderabad**
and all its branches.



Type setting, Printed and Published by
**JAYANTHI PUBLICATIONS**
19 - 90, P & T Colony, Dilsukh Nagar, Hyderabad - 500 060.
Ph. (040) 4161057

# అంకితం



చెన్నై నగరంలో తెలుగు వెలుగులు విరజిమ్మే
ప్రముఖ నారీమణి,
తెలుగు దేశానికే వన్నె తెచ్చిన
మేటి రచయిత్రి,
మంచితనం, మానవత్వం పంచుకొని
దేశ దేశాలలో కీర్తి గడించిన
సాహితీమూర్తి,
అందరికీ ఆత్మీయురాలు...
శ్రీమతి **మాలతీ చందూర్** గారికి
ఈ కావ్యాన్ని చిరుకానుకగా అందిస్తున్నాను.

— వాసా ప్రభావతి

# నా మాట

సుమారు 1953 నుంచి కవిత్వం రాస్తూనే ఉన్నా! 1975 నుంచి ఎక్కువగా రాయడం మొదలుపెట్టాను. మొదటినుంచి స్త్రీ నా రచనలకు ప్రధాన వస్తువు.

నా మొదటి కవితాసంపుటి 'ఆలాపన' లో 'ఓ కోయిలా పాడవే!' అన్న కవితలో స్త్రీని కోయిలతో పోల్చి వర్ణించాను. 'అమ్మ' రెండవ సంకలనంలో అమ్మలోని ప్రాధాన్యతను విప్పి చెప్పాను. మా స్వగ్రామం ఆత్రేయపురంలో ప్రారంభోత్సవం చేసాము. అప్పుడు తెలిసింది నాకు- చదువుకోని స్త్రీలు కూడా కవిత్వాన్ని ఆదరిస్తారని. స్త్రీలకర్థమయ్యే భాషలో స్త్రీలను గురించే రాయాలని నిర్ణయించుకున్నాను. అక్కడ ఎందరో స్త్రీలు 'అమ్మ' పుస్తకాన్ని అడిగి పట్టుకెళ్లారు.

'అమ్మను గురించి పుస్తకం రాసావుట. నాకు చదవడం రాకపోయినా నా కొడుకు చేత చదివించి, అమ్మంటే ఎవరో తెలియచెబుతానమ్మా!' అన్న ఈ మాటలు నా చెవుల్లో ఇప్పటికీ రింగుమంటూనే ఉంటాయి.

మావూరి నుంచి తిరిగి వచ్చిన తరువాత మా కాలేజీలో ఎందరో లెక్చరర్లు ఆ పుస్తకాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. బెజవాడ గోపాలరెడ్డిగారు, దాశరథిగారు అటువంటి ఉత్తమమైన గ్రంథాలే రాయాలన్నారు. విజయనగరం నుంచి ఆచార్య భావన 'అమ్మ బొమ్మలో అమ్మ' అంటూ ఓ పత్రికలో పెద్ద వ్యాసం రాసి ఆ పుస్తకానికి మరింత ప్రాధాన్యత కలిగించాడు.

తరువాత ఎన్నో వ్యాసాలు, కథలు స్త్రీల సమస్యలపై రాసాను. 'కాటుక కంటినీరు' కవితాసంపుటి బాలికల సమస్యలపై రాసిన గ్రంథం.

'మంజీర నాదాలు' స్త్రీ ప్రాధాన్యతను రకరకాల కోణాలనుంచి వర్ణించి చెప్పిన గ్రంథం. సాహితీవేత్తలు, కవయిత్రులు, రచయిత్రులే కాదు.., నన్నపనేని రాజకుమారి వంటి రాజకీయవేత్తలు కూడా ఆ పుస్తకంలో స్త్రీ ప్రాధాన్యతను వర్ణించిన తీరును మెచ్చుకున్నారు. స్త్రీ తనలోని శక్తి, సామర్థ్యాలు గుర్తించిననాడే ఈ సమాజంలో ఒక వ్యక్తిగా నిలబడుతుందని ఆ ప్రాధాన్యతను గుర్తించాలంటే 'మంజీర నాదాలు' చదవాలన్నారు.

సాహితీ చైతన్యమూర్తి పోతుకూచి సాంబశివరావుగారు ఆ పుస్తకంపై వ్యాసపోటీని ప్రకటించారు. సెంట్రల్ యూనివర్శిటీ లెక్చరర్ డా: శరత్‌జ్యోత్స్నారాణి, డా: పార్వతీదేవి (విజయవాడ తెలుగు లెక్చరర్) బహుమతులు గెల్చుకున్నారు.

ఇప్పటికి కవిత్వంలో 9 గ్రంథాలు వెలువడ్డాయి. 10వ గ్రంథమిది. స్త్రీల సమస్యలను గురించి రాసిన ప్రత్యేక కవితల కూర్పు ఇది. 1984 నుంచి రాసిన కవితలు ఇందులో ఉన్నాయి.

ఈనాడు సమాజంలో స్త్రీ ఎంతో కష్టపడుతోంది. తాను పెరిగి, సంసారాన్ని పైకి తీసుకువస్తోంది. తల్లితండ్రులను ఆదరిస్తోంది. చాకిరీ చెయ్యడమే కాదు, ఆర్థికంగా ఆదుకుంటోంది. పిల్లల ఆలనాపాలనా చూసేది, విద్యాబుద్ధులు నేర్పేది స్త్రీయే! ఒకపక్క

ఇంటి చాకిరీ, మరోపక్క పిల్లల చాకిరీ, మరోపక్క ఉద్యోగం, చుట్టాల బెడద, అత్తమామల సేవా... అన్నింటికీ స్త్రీయే పెద్ద దిక్కు.

ఇంత ప్రగతి సాధించినా స్త్రీ తనంతట తాను మరిన్ని కష్టాలు కొనితెచ్చుకుంటోంది. బాధ్యతల మధ్య నలిగిపోతోంది. విశ్రాంతి లేక సతమతమవుతోంది. ఎంత చదువుకున్నా అత్తా- ఆడబిడ్డల పోరు తప్పడం లేదు. సంపాదిస్తున్న భార్యను చూసి సంతోషించవలసిన భర్త- శాడిజం పెంచుకుంటున్నాడు. రాసి రంపాన పెడుతున్నాడు. ఆఫీసుల్లో లైంగిక వేధింపులు.

కట్నం చాలలేదని హత్యలు, ఆత్మహత్యలు, అత్తా- ఆడబిడ్డల రాపిళ్ళు, ఇంట్లో వంటరిగా ఆడపిల్లను వదిలితే మానభంగాలు చేసి పీకలు నులుముతున్నారు. నడిరోడ్డులో రౌడీ మూకల బెదిరింపులు. ఇవేకాదు, స్కానింగులో కడుపులో ఉన్నది ఆడపిల్లని తెలిస్తే బలవంతంగా అబార్షన్స్ చేయిస్తున్నారు.

రాజకీయపరంగా కూడా స్త్రీ వెనుకబడే వుంది. చట్టాలు, బిల్లులు స్త్రీల కష్టాలను తీర్చలేకపోతున్నాయి.

స్త్రీలలో చైతన్యం రావాలి. సమాజాన్ని ఎదిరించి నిలిచే శక్తి రావాలి.

స్త్రీల అమాయకత్వం వల్ల పురుషాధిక్యత మరింత పెరుగుతోంది.

స్త్రీలకు స్త్రీలు కూడా శత్రువులే. పురుషులను తిట్టడం, వారిని కిందికి నెట్టడం వల్ల స్త్రీ సమస్య తీరదు. స్త్రీ పురుషులిద్దరూ సమానంగా పెరగాలి. అతనిలోని అహం తగ్గాలి. ఈమెలోని అమాయకత్వం తగ్గి, సంస్కారవంతురాలై పురుషునితో సమానంగా ఎదగాలి. అప్పుడే హెచ్చుతగ్గులు నశిస్తాయి. ఏ సమస్యనైనా ఎదుర్కొనే శక్తి ఆమెలో పెరగాలి.

స్త్రీ సమస్యకు ప్రాధాన్యమిస్తూ నేను రాసిన కవితాహారమే ఈ 'మళ్ళీ మళ్ళీ పుడతా...' కావ్యం. స్త్రీ... పురుషునిలో అర్ధభాగం అయినప్పుడు- స్త్రీలో సగం పురుషుడే కదా! అందుకే ఈ కవితలో-

'ఈ ప్రకృతి అంతా నేనేనని, నాలో సగం పురుషుడని, నవ రసాలు నాలోని నాదాలని, అవే ఈ లోకానికి వేదాలని, ఇప్పుడిప్పుడే తెలుసుకున్నా. పునర్జన్మలంటూ ఉంటే మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా..!' ఒక కవితకు ఆఖరి పాదాలు. అందులో నుంచి 'మళ్ళీ మళ్ళీ పుడతా...' ఈ కావ్యానికి నామకరణం.

ఇందులో స్త్రీ సమస్యలు రకరకాల కోణాల నుంచి రాయడం జరిగింది.

'నాకు బతకాలని ఉంది.' అన్న కవితలో-

'హృదయాన్ని ఇచ్చిపుచ్చుకున్న ప్రియుని చేయి పట్టి, రెప్పపాటంత జీవితకాలంలో దోసిళ్లతో ఆనందం నింపుకోవాలని ఉంది' అని వర్ణించాను.

అదే కవితలో మరోచోట-

'సిపాయినై తుపాకి పట్టి, దేశ రక్షణకు సమిధను కావాలని ఉంది.'- అంటూ స్త్రీ పురుషులిర్వురు ఒక్కటైనప్పుడు స్త్రీ కూడా పురుషునితోపాటు అన్ని రంగాలలో ముందుకు రావాలని తెలియచెప్పాను.

ఇందులో 'నా మహిళ' కవిత భిన్నంగా ఉంది. అది స్త్రీ సమస్యలను గురించి రాసిన కవిత కాదు. స్త్రీ ఔన్నత్యాన్ని గురించి రాసిన కవిత. ఇందులో భావంతోపాట భాషామాధుర్యాన్ని స్త్రీ ఔన్నత్యానికి పీఠంగా పొందుపరిచాను.

'శరత్కాలాన ఘుమఘుమా పొంగు
శశిరేఖ తళుకుల బెళుకు నా మహిళ,
హిమాద్రి శిఖరాగ్రి నుండి జలజలా పారు
గంగా సముత్తుంగ తరంగ విభ్రమ లావణ్య నా మహిళ!'

- అంటూ ప్రారంభం చేశాను.

కవిత్వమంటే... అక్షరాల కొలువు కాదు. హృదయంలో పల్లవించి, భాషలో పరిమళించే భావ స్పందన. ప్రకృతిలో అత్యుత్తమమై, అతి కీలకమై, ఈ లోకంలో అణువణువునా అల్లుకున్న జీవపాత్ర స్త్రీ. అటువంటి తేజోమూర్తి కష్టాలు, సుఖాలు, దుఃఖాలు అన్నింటినీ భాషా సౌందర్యంతో మూర్తీభవింపచేయాలన్నదే దీని పరమార్థం.

'మళ్ళీ మళ్ళీ పుడతా...' ద్వితీయ ముద్రణ ఇంత త్వరలో వస్తుందని మేము మొదట ఆశించలేదు. పాఠకలోకం అందించిన అభిమానమే దానికి కారణం. వారికి నా కృతజ్ఞతలు.

ప్రథమ ముద్రణకు ముందుమాటను విపులంగా, విమర్శనాత్మకంగా రాసి సాహిత్యాభిమానుల మన్ననలు అందుకున్న ప్రముఖ కవులు, ప్రఖ్యాత విమర్శకులు అయిన **జ్వాలాముఖి**గారి పీఠికను 'మళ్ళీ మళ్ళీ పుట్టే కవితా చైతన్యానికి జేజేలు' గా ఈ ద్వితీయ ముద్రణలో కూడా చేర్చుకుంటున్నాము. వారికి నా హృదయపూర్వక అభివందనాలు.

నేను అభిమానించే ఉత్తమ సాహితీ విమర్శకురాలు, నేటి రచయిత్రులలో ఆణిముత్యం అయిన **డా: సి. మృణాళిని**ని రెండవ ముద్రణకు అభిప్రాయం రాయమని కోరగానే- వివిధ పనుల భారంలో ఉన్నా, కొత్త కోణంతో ఈ కవితల్లోని స్త్రీ చైతన్యానికి అద్దం పడుతూ అభిప్రాయం రాసి ఇచ్చినందుకు ఆమెకు నా కళాభినందనలు.

ప్రథమ ముద్రణను అంకితం తీసుకోడానికి అంగీకరించినట్లుగానే 'మళ్ళీ మళ్ళీ పుడతా...' ద్వితీయ ముద్రణను కూడా అంకితం తీసుకోడానికి అంగీకరించిన ప్రముఖ రచయిత్రి, నాకు ఆత్మీయురాలు అయిన **శ్రీమతి మాలతీచందూర్**గారికి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

ఇక...

ఈ 'మళ్ళీ మళ్ళీ పుడతా...' ద్వితీయ ముద్రణను మొదటి పేజీ నుంచి చివరి పేజీ వరకు ఎంతో కళాత్మకంగా తీర్చిదిద్దిన **జయంతి పబ్లికేషన్స్** అధినేతలు, ప్రముఖ రచయి(త్రి)తలు... **శ్రీమతి కృష్ణజయంతి, శ్రీ యస్వీకృష్ణ** దంపతులకు నా హార్దికాభినందనలు.

**- కవయిత్రి**

# ‘మళ్ళీ మళ్ళీ పుట్టే కవితా చైతన్యానికి జేజేలు’

– జ్వాలాముఖి

సోదరి వాసా ప్రభావతిగారు స్పందనల సంపుటి- కవితా సంపత్తిని స్త్రీజాతికి అంకితం చేసిన నిబద్ధ కవయిత్రి, కన్నీటికి సానబెట్టిన వివేకి.

కవిత్వాన్ని సుఖానుభూతి కోసం కాక, మానవ కళ్యాణం కోసం రాసేవారు సాహిత్య ఉద్యమకారులు. ఉద్యమ కవిత్వాన్ని రస నిష్పత్తితో గాక మమేక ప్రతిపత్తితో చూడాలి. ‘వస్తువు’ ఉద్యమమైనప్పుడు- ‘శిల్పం’ నుడికారం కావాలి. వీటికి సమన్వయం కుదరాలి. యుగావసరాన్ని పూరించే ప్రాసంగికత ప్రయోజనంలో సిద్ధించాలి.

సాహిత్య ప్రమాణాలు, జీవిత ప్రమాణాలకు అతీతంగా ఉండవు. ఉండరాదు కూడా. ఇది ప్రజాస్వామిక యుగ బాధ్యత. అధిక సంఖ్యాకులైన ప్రజల ప్రయోజనం ఈ యుగ లక్షణం. ఈ పరిధిలోనే సమన్వయం సమకూరాలి. జీవితంలోని అశాంతికి, సమాజంలోని సంక్షోభానికి అవినాభావ సంబంధం ఉంది. జీవితాన్ని సమాజం నుంచి వేరుచేసి చూసే కావ్య లక్షణాలకి కాలం చెల్లింది.

ఒక విషయాన్ని మరో విషయంతో పోల్చే ప్రక్రియే కావ్య ప్రపంచం కదా! పోలిక, పోల్చబడేవి (ఉపమాన, ఉపమేయాలు) యదార్థ ప్రపంచానికి లేదా దానికి సంబంధించిన ఊహకి భిన్నంగా ఉండజాలవు. అసందర్భ పోలికలు కాని, అవాస్తవికంగా పోల్చబడే అంశాలుగాని ఈనాడు ప్రాసంగికాలు కావు. ఈనాడు సమాజం అభివృద్ధి క్రమంలో ఉంది. ఈ అభివృద్ధి క్రమానికి భిన్నంగా సాహిత్య ప్రపంచాన్ని నిర్మించజాలం. నిర్మిస్తే అది అభివృద్ధి నిరోధకమే అవుతుంది. ప్రజాస్వామిక యుగంలో సంస్కారం వస్తువు. సమీకరణ శిల్పం. రెండింటి సమన్వయం అభివృద్ధి క్రమం.

బాధ ఎంత ప్రాసంగికమో... నివృత్తి అంత సామాజికం. ఈ అవిచ్ఛిన్న సందర్భాన్ని గుర్తించినప్పుడే కవిత్వం చైతన్యమవుతుంది. అది యుగావసరాన్ని తీరుస్తుంది. సమస్య జీవితంలో అశాంతిని రేపినా పరిష్కారం సమాజంలో రూపుదాలుస్తుంది. జీవితపు అశాంతిని జీవితానికే పరిమితం చేసి చూసినప్పుడు సృజన- స్వీయ మానసిక ధోరణి (సబ్జెక్టివ్) కి బలవుతుంది. అందువల్లే మనుషులు రాగద్వేషాల పుట్టలుగా పుట్టి, సాహిత్యంలో కొరకరాని కొయ్యలుగా తయారవుతారు.

సాహిత్యం ఈనాడు ‘సామాజిక లక్ష్యం’ (అబ్జెక్టివ్) గా ఆలోచించక తప్పదు. మనిషి సంఘజీవి, బుద్ధిజీవి. సమిష్టితత్వం, కార్యాచరణ సంబంధం కవితావేశానికి రక్తమాంసాలు కావాలి. మధ్య తరగతి సమాజగతికి భిన్నంగా లేదు. కవితా సందర్భాలు సామాజిక సందర్భాలన్న విషయం కవికి ప్రాణం పోస్తుంది.

కవికి నిజాయితీ ప్రధానం. అది ప్రతిభకి పదును పెడ్తుంది. ఉత్పత్తికి వికాస మార్గం చూపుతుంది. అభ్యాసానికి సమాజం నేపథ్యమవుతుంది. ఈ సమన్వయం కుదిరినప్పుడే ‘వస్తువు’ ఎన్నికలోను, నిర్వహణలోను, పరిష్కారంలోను కవిత్వం చైతన్యం అవుతుంది.

సోదరి వాసా ప్రభావతిగారిలో నిజాయితీ ఉంది. వస్తువుతో మమేకం చెందే నిబద్ధతా వుంది. సమస్యల సంపుటి తెరిచే లోకానుభవం ఉంది. పరిష్కారాల సరిహద్దుల్ని చూసే విజ్ఞత ఉంది. ప్రతీ కవిత సమస్యను తాకి పరిష్కారం వైపు సాగి దాన్నే శీర్షిక చేసుకుంటుంది.

జీవితాన్ని చూడడం స్పృహ. సమాజాన్ని చూడడం చైతన్యం. రెండింటికి సమన్వయం కుదర్చడం నిబద్ధత.

మధ్య తరగతి చాలా అభద్రతాభావంలో కొట్టుమిట్టాడుతూ ఉంది. అది తన విముక్తిని మాత్రమే కోరుకుంటూ ఉంది. ఈ అతి స్వీయజాగ్రతా లక్షణమే అశాంతిని మరీ పెంచుతూ ఉంది. ఈ జాడ్యం నుండి మధ్య తరగతి బయటపడి మిగతా శ్రమజీవుల మనుగడ పోరాటంలో మమేకం చెందిననాడు సమస్యలే పరిష్కార కేంద్రాలవుతాయి.

స్పృహ చైతన్యం కావాలి. చైతన్యం దృక్పథం కావాలి. దృక్పథం విశ్వజనీనం కావాలి. ఈ ప్రాపంచిక బాధ్యతలోకి కావ్య ప్రపంచం వచ్చేసింది.

సోదరి వాసా ప్రభావతిగారు కవిగా పుట్టి (1953) ఎదిగిన కాలం (1975 ఎమర్జెన్సీ) దేశం వళ్లు విరిచిన కాలం. ఆత్మీయత 'అమ్మ' గా మొగ్గ తొడిగింది. నిరక్షరాస్యులైన అమ్మలు కొడుకులతో చదివించుకున్నారు, 'అమ్మ' ను తెలుసుకున్నారు. చదువురాని ప్రపంచం గురించి రాయాలనే తపన, స్పృహను చైతన్యంగా మార్చింది. 1984 నుండి నేటిదాకా ఆరనికుంపటిలా రగిలిన కవయిత్రి ప్రతి రచనలోనూ స్త్రీ వ్యక్తిత్వాన్ని నిగ్గుతేల్చింది. ఈ నిగ్గు తేలిన చొక్కపు బంగారమే 'మళ్ళీ మళ్ళీ పుడతా...' ఇది స్వగతాల కుంపటి, ప్రకాశాల సంపుటి.

ఈ పదవ సంకలనంలో నవ మాసాల భారం లేదు. కొత్త తరం నెత్తురు సంతకం ఉంది. భర్తల శాడిజాన్ని గెలిచే 'సంభవామి యుగే యుగే' తేజస్సు ఉంది.

'చదువుకోని స్త్రీలు కవిత్వాన్ని ఆదరించేట్లు, అవగాహన చేసుకొని వెంట నడిచేట్లు చూసుకునే ఉద్యమ బాధ్యత' ఈ సంపుటి. ప్రతి అక్షరంలో ఉప్పు- కారం తిన్న సంగతి తెలుస్తుంది. ప్రతి విషయంలో చీము- నెత్తురు కనిపిస్తుంది. 'ఏ సమస్యనైనా ఎదుర్కొనే శక్తి స్త్రీలో పెరగా' లనే సంకల్పం ప్రతి రచనకు శీర్షిక అవుతుంది.

కావ్యం కాంతా సమ్మితమంటే- కాదు, చైతన్య సమ్మిళితం అని చాటిచెప్పిన 'అమ్మ హితవు' లాంటి ఆప్తవాక్యం ఈ సంపుటి. దానికి ఎంత ఆర్ద్రత ఉందో- అంత నిశితత్వం కూడా ఉంది. ఆత్మవిశ్వాసంలో ఆత్మగౌరవం చోటుచేసుకుంది.

***'ఈ ప్రకృతి అంతా నేనేనని / నాలో సగం పురుషుడని***
***నవరసాలు నాలోని నాదాలని / అవే ఈ లోకానికి వేదాలని***
***ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నా...***
***పునర్జన్మలంటూ వుంటే***
***మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా..!'***

ప్రకృతి-పురుషుల అద్వైత భావనలో ఇకపై నాయకత్వం స్త్రీదేనని చాటుతూ, అర్ధనారీశ్వర తత్వాన్ని, అర్ధ పురుష తత్వంలో తిరగేసి చెప్పే 'మహిళోపనిషత్తు' ఇది. ఇంతకాలం జరిగిన అవమానానికి ప్రతిఘటన ఇది. పునర్జన్మల కర్మసిద్ధాంతానికి సవాలు ఇది. స్త్రీ ఆత్మగౌరవ శపథానికి పరాకాష్ఠ ఇది.

ఈ కవితలో- ఏడు సందర్భాల్లో ఓటమికి నెట్టబడిన స్త్రీ 'సప్తపది' లాంటి శాపాన్ని ధిక్కరించి 'ఏడుగడ' గా 'మనుగడ'ను సాధించిన, తరగని ఆత్మవిశ్వాసపు శాశ్వత చిరునవ్వు మకుటమైంది. ఆ కవితకే అది మకుటం కాదు. మొత్తం సంకలనానికే అది మకుటం. అందుకే 'మళ్ళీ మళ్ళీ పుడతా (ఆడవారిని అనేక దశల్లో అనేక విధాలుగా చంపే కుసంస్కారంతో) ఆడదానిగా!' అనడం ఓటమి తిరుగుబాటు.

ఈ మహాసంకల్పంలో స్త్రీజాతి ఆత్మవిశ్వాసం గొప్పది. అది నిత్య సంఘర్షణలో నిలిచే ఒక యుగం ప్రతిజ్ఞ. ఒక తరం దీక్ష. పోరాట నిరంతరతల యుద్ధ ఘోష.

***'అత్యాచారాల అడకత్తెరలో / కాలు నిలదొక్కుకుని***
***ఆడపిల్ల బతికి బట్టకట్టేవరకు / ఆడువారి పెదవులపై***
***చిరునవ్వులు విరజిమ్మేవరకు...***
***పునర్జన్మలంలూ వుంటే***
***మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా..!'***

ఈ వజ్ర సంకల్పంలో ఓటమి నంగీకరించిన స్త్రీ విలువల దీర్ఘకాలిక విముక్తి యుద్ధసంస్కారాన్ని సవాలుగా చాటింది.

మధ్య తరగతి ఇల్లాలు దుర్భర పరిస్థితుల్లో సంసార భారాన్ని మోస్తుంది. తరాల బాధ్యతగా ఆ వారసత్వ సంస్కారాన్ని చెప్పిన తీరు బొమ్మ కడుతుంది... కొత్త కవి సమయంలా.

'శరీరాన్ని తోపుడుబండిలా తోసుకుపోయే ఓ తల్లి ఎవరో కాదు.., మన తల్లే' అనిపిస్తుంది. ఆమె మహాసాధ్వి, ఉత్తమ ఇల్లాలు. ప్రతికూల వాతావరణంలో జీవితాన్ని అనుకూలం చేసుకున్న ప్రాజ్ఞురాలు. ఒక తరం బాధ్యతను నెరవేర్చే విజ్ఞురాలు.

స్త్రీల సమస్త పీడనలకు అర్ధరాత్రి స్వాతంత్ర్యానికి ముడిపెట్టి చెప్పిన తీరు గొప్ప రాజకీయ శ్లేష.

***'స్వరాజ్యం అర్ధరాత్రి వచ్చింది కదా!***
***అందుకే ఆ వ(సి)నిపిల్ల***
***బతుకు వాకిటిలో***
***ఇంకా తెల్లవారలేదు'***

- చేదు నిజాన్ని కావ్యనైజంగా మలచిన తీరు ప్రశంసనీయం. ఎంగిళ్లు తిని రుచి మరచిన బాల్యానికి స్వరాజ్యమే చీకటి తెరగా మారిందని, తెల్లవారడం శేషప్రశ్న అని... స్వాతంత్ర్యాన్ని నిలదీసిన తీరు అద్భుతం.

'వేదాంతి' లా మారిపోయిన పనిపిల్లను చూసేదెవ్వడు? ఈ దేశంలో దరిద్ర బాల్యానికి తగిన పోషణ లేదు. విజృంభించే యవ్వనానికి క్రమశిక్షణ లేదు. మూలకొరిగిన ముసలితనానికి విశ్రాంతి, గౌరవం లేవు. బాల్యం గురించి రాసిన తీరు గమనార్హం.

*'వయసొచ్చి చిన్నారి పొన్నారియైతే*
*ఆ యింటిలోని ఏ గ్రద్ధ పొడిచి తింటుందో తెలియదు*
*అందరూ ఉన్నా ఎవరూ లేని అబల ఆమె.'*

పనిపిల్ల పెద్దదిగా మారడాన్ని, 'చిన్నారి-పొన్నారి' గా క్రమోన్నతిగా వయసు పరలో చూపడం కవితానైపుణ్యం. ఇంట్లో గ్రద్దలు పొడుచుకు తినడం- యజమానులు పనిపిల్లల మీద చేసే దుర్మార్గం. ఇక్కడ 'అబల' అనే మాట శారీరక బలానికి సంబంధించిన మాటగా కాక, 'సాంఘిక స్తోమత' (పరాధీనత) కు సంబంధించిన మాటగా సమకూర్చడం ప్రతిభ. దృష్టి- దృక్పథంగా మారితేనే సాధ్యపడే కవితాకళ ఇది.

వ్యసనానికి బానిస అయిన భర్త- ఏనాడైనా తాగని భర్తగా ఇంటికి వస్తాడేమోనని 'నిరీక్షణ' కు వేలాడే భార్యకు 'దేహశుద్ధి' ఫలితమైతే ఆ ఘోష చెప్పరానిది.

*'ఆడువారి అడుగుల రాపిళ్లలో / పుడుతుంది ఆరని చైతన్యం.*
*సుప్రభాతంలోని నునువెచ్చని సూర్యకిరణాల్లా*
*ఈ లోకమంతా నువ్వే / ఈ నేలంతా నీ అడుగుజాడలే!'*

'చరిత్రను ఆధునిక స్త్రీ పునర్లిఖిస్తుం' దన్న గురజాడ స్వప్నాన్ని నిజం చేయడానికి స్త్రీ సమస్యలకు స్త్రీయే నాయకత్వం వహించి పోరాటం చేయాలి. ఆ అడుగుల్లో పుట్టే చైతన్యం లోకానికి తిరుగుబాటు అడుగుజాడలై నిలిచిపోతాయి. ఈ యదార్థం సుప్రభాతమవుతుందనడమే- పై పంక్తుల సారాంశం. లోకమంతా విస్తరించే స్త్రీ నాయకత్వం లోక కళ్యాణానికి పూనుకుంటే అభ్యంతర పెట్టాల్సిందేమీ లేదు. పురుషాధిక్య భావానికి జవాబుగా స్త్రీ ఆధిక్యభావం వస్తేనే సమాజం అమెరికా, ఐరోపాల్లోలాగా అశాంతి పెరుగుతుంది. ఈనాడు కావల్సింది- సమానత్వం, సహజీవనం, సహకారం, సమాదరణ. దాష్టీకానికి జవాబు దుర్మార్గం కాదు. ప్రతీకారం సమాధానం కానేకాదు.

సంతతి దాహం తీర్చే తల్లి బాధ్యతను బొమ్మ కట్టించిన తీరు ఒక చిత్రలేఖనం. శ్రవ్యకావ్యం దృశ్యకావ్యమైన కృతి.

*'కడవ మోసే తల్లి పచ్చని ఆశ*
*ప్రమిదకున్న దోసెడు ఆశ*
*మోడుకున్న బారెడు ఆశ'*

మన దేశానికి మిగిలింది గతమే. ప్రస్తుతం లేదు. ఎంత ఘోరం జరిగినా పట్టించుకోనితనం మధ్య తరగతిలో తిష్ట వేసింది. ఎవడి పెళ్లాన్ని వాడు కొట్టుకుంటే మనకేమిటనేది శాస్త్రం. పెళ్లికి వెళ్లి మెక్కివస్తాం కాని, అదే పెటాకులుగా మారితే చూసీచూడనట్లుంటాం.

ఈ మూగనోము కుట్రను బద్దలు చేయడానికి నడుం కట్టారు ఈ పంక్తుల్లో కవయిత్రి.

*'ఈ సమాజం కళ్లు తెరచి చూడదు*

*నోరు విప్పి మాటాడదు'*

రామాయణం (రంకు) లో జరిగిన సీతా పరిత్యాగం, భారతం (బొంకు) లో జరిగిన ద్రౌపదీ వస్త్రాపహరణం... రెండూ తేల్చినవి- పెద్ద మనుషుల మౌనాంగీకారాలు. ప్రజాస్వామ్యంలో ఈ పట్టించుకోని తనం- ఫాసిజాన్ని ఆహ్వానిస్తుంది. భర్త నిరీక్షణ మృత్యు నిరీక్షణ కావడం క్షమించరానిది. 'పచ్చని చెట్టు నేలవాలినట్లు కుప్పకూలిన శబ్దం' పిక్కటిల్లినా పట్టించుకోని సంఘానికి ప్రగతి లేదు.

స్త్రీని 'అనుభవైక వస్తువు' గా చూసే అభ్యాసానికి పూనుకున్న జాతికి వావివరసలు పట్టవు.

*'పొంచి ఉన్న తోడేలు*

*కన్నతండ్రేయని తెలియని'*

కన్నెపిల్ల బలవుతున్న తీరును విప్పి చెప్పారు ప్రభావతిగారు.

పాతతరం అనుభవపాఠాల 'నాయనమ్మ' కొత్తతరాలకు 'బాలశిక్ష.' ఉద్ధరిస్తాడనే కొడుకు సర్వం ఊడ్చిపెట్టినా బోసి బతుక్కి మిగిలింది తరగని కథల రాశి. మనుమల పాలిట వరం. ఆరు ఋతువుల్లో చిగురించే ఆశ. అమాంతంగా వేరుపురుగు కారణంగా కట్టె కన్ను మూస్తే మనుమలే 'నాయనమ్మ పేదరాశి పెద్దమ్మ దగ్గరికి పోయిం' దని సమాధానపడితే, 'నేనెక్కడికి పోతానురా నీ కడుపున నీ కడుపున పుడతానురా' అని ముందు తరాల ముఖపోలికల్లో ప్రత్యక్షమవుతే 'నాయనమ్మ' సంస్కారం తరాల అనుభవాల గని అని బొమ్మ కడుతుంది. లోక సహజ రీతులను ఛేదించుకుని వచ్చే తరాల అనుభూతి సంపద నాయనమ్మ. చదువరి ఈ కవితను చదవగానే తన 'నాయనమ్మ'ను, అమ్మమ్మను, తాతమ్మను గుర్తుచేసుకోక మానడు. తాదాత్మ్యం చెంది రాసిన ఆర్ద్ర కవిత ఇది. వృద్ధాప్యం బాల్యాన్ని ఆశ్రయిస్తే, బాల్యం వృద్ధాప్యాన్ని ఆదరిస్తుంది. మధ్యలో యవ్వన పుత్రుడే ఊడ్చుకుతినే దరిద్రుడు.

స్త్రీ నరక స్థానాలు- వంటిల్లు, పడగ్గది, నడిరోడ్డు. వారసత్వపు శాపం వంటయిల్లు. దాంపత్య పాపం పడగ్గది. బతుకు వికారం నడిరోడ్డు. అడిగే నాథులే నేరస్థులు. ఇక్కడ సిగ్గుబిళ్ల, సతీ సహగమనం, కన్యాశుల్కం, వరకట్నం, శిశుహత్యలు, దేవదాసీ పడుపువృత్తి... అన్నీ స్త్రీపరంగా సాగే దుర్మార్గపు సంప్రదాయాలు. పడుపువృత్తికి కులాన్ని కేటాయించింది మన సంస్కృతి. ఈ దురాచారాలన్నీ మతపరంగా వేళ్లూనుకున్నాయి, కుల పరంగా విజృంభించాయి.

అర్థబలం ఉన్నా అంగబలం లేనివారు, దేహబలం ఉన్నా ఆత్మబలం లేనివారు, ఐక్యతా బలం అందుకోలేనివారు సమిధలవుతున్నా ఇది ఎక్కువకాలం కొనసాగదని పిడికిళ్ళు బిగించిన పీడిత స్త్రీలు దుర్మార్గాలకు చరమగీతం పాడతారని హెచ్చరించారు కవయిత్రి.

'తల్లి మాటలు విని పెళ్లాన్ని బూడిద చేసేవాడు, పెళ్లాం మాట విని తల్లిపై చెయ్యెత్తేవాడు సంస్కారి కాదని, క్షణిక జీవితంలో వ్యక్తిత్వం లేని భర్తతో కాపురం చేయడం, బాంబులున్న భవనంలో

నివాసం చేయడమని, హృదయం లేనివాడితో బతకడం కన్నా సబల బ్రహ్మచారిణిగా బతకడం మేలు' అనడం స్త్రీ ఆత్మగౌరవానికి పతాక. కల్లు పాకల్ని చేరే భర్తలకు హెచ్చరిక. గర్భస్థ ఆడశిశువుల్ని చంపే దేశంలో అమ్మాయిల్ని మాత్రమే కనాలని అమ్మలకు మరో ఉద్బోధ.

*'అమ్మ వంటిమీది చెమట బిందువులు / గృహానికి ముత్యాల సిరులు'*

'ఇయంగేహే లక్ష్మీ' సాక్షాత్కార దృశ్యం ఇది.

అమ్మ చాకిరి ఒక బాధ్యత. అది సంసార సిరుల్ని పెంచుతుంది. కాని, వాటాల్ని, లాభాల్ని కోరదు. తల్లే శ్రామిక జీవి. కుటుంబానికి మూలస్తంభం.

*'కష్టంలో సగం కడుపు నిండుతున్నా*
*మిగిలిన సగం విచ్చుకున్న పంటచేలు'*

ఆకలిని పెట్టుబడి పెట్టి, చెమట నీటిని సాగుచేసి పంటల్ని పండించే రైతు నిరుపేద జీవితానికి భాష్యం ఇది.

*'వారి శ్రమకు పల్లవించిన ప్రకృతి / పంట పొలమై వారి వెంటే కదులుతుంది.'*

రైతు శ్రమకు 'పల్లవి' ప్రకృతి. పంట పొలం 'చరణం.' వ్యవసాయ గతుల్ని పల్లవీ చరణాలుగా తీర్చిదిద్దడం గొప్ప విషయం.

*'ఆడకూలీ జీతం తక్కువిచ్చి*
*శ్రమను అవమానించినా*
*పనిలో భేదం చూపని పసిడి మనస్సు వారిది*
*రేపటి పొద్దులో ఆ భేదం కరిగిపోతుంది.'*

శ్రమ దోపిడికి లింగ వివక్షత వల్ల స్త్రీల అవమానం శ్రమ అవమానంగా చూపి, స్త్రీ ఔన్నత్యం పసిడిలా మెరుస్తుందని చెప్పడం, ఈ భేదం రేపటి పొద్దులో కరిగి తీరుతుందని నమ్మకం ఈయడం, శ్రామిక జీవుల పట్ల సంఘీభావమే కాదు.., 'మార్పు' అనివార్యతను విప్లవాత్మకంగా చాటడం ప్రశంసనీయం. పురుష ద్వేషం లేదు, 'శ్రమ అవమానం' మాత్రమే దృష్టి నాకర్షిస్తుంది. 'దృఢమైన వెన్నెముకల్ని, బలమైన చేతికర్రల్ని నమ్ముకున్ననాడు 'పాలు పంచి ఇవ్వక తప్ప'దని స్త్రీ రిజర్వేషన్ల యుద్ధఘోష. 'సుప్రభాతాలు కావు, చింత నిప్పులు కావాలి' అనడం పోరాట నిబద్ధత.

'అయిదవతనం స్త్రీకి సహజంగా సమకూరిన హక్కు. బొట్టు, జుట్టు, కాటుక, గాజులు భర్త పోగానే తీసేసే అధికారం ఎవరికీ లేద'ని 'ఎర్రకోక'లో చాటడం ఒక ప్రతిజ్ఞ. 'తెల్లకోక' ధిక్కారం, ఆత్మాభిమానం- తిరగబడి దురాచారాల్ని రూపుమాపమని పిలుపు.

అబద్ధాల ప్రపంచంలో నిజాలకు పునరుక్తి దోషం లేదు. వంటిల్లు, పడకటిల్లు, నడిరోడ్డు ఇదివరకో కవితలో చెప్పినా, ఇప్పుడు శ్వాస ఆడని స్థలంలో వంటిల్లును, శ్వాస అందని బందిఖానాగా పడకటిల్లును, శ్వాస వదలలేని భీతిగా నడిరోడ్డును చిత్రించిన తీరులో స్త్రీ స్వాతంత్ర్యపు పెనుగులాట కనిపిస్తుంది. ఉచ్ఛ్వాస-నిశ్వాసాలే పరాధీనమైనప్పుడు బతుకు నిరర్థకం అనిపిస్తుంది.

కాని, కవయిత్రి ఆ నైరాశ్యానికి, ఓటమికి చోటివ్వరు. తిరుగుబాటును కోరుతారు. గృహనీతికి, సంఘనీతికి అవినాభావ సంబంధం ఉంది. ఆ లంకెను చూపడమే ఈ కవిత పరమార్థం. సంక్షేమ రాజ్యం పోలీసురాజ్యంలో గూండాల ఆటవిడుపుగా మారినప్పుడు- 'నడిరోడ్డు నరకం మొదట స్త్రీపై పడుతుంది.

సాంఘిక అభద్రత- కుటుంబ అశాంతికి దారితీస్తుంది. వంటిల్లు పొగచూరి ఊపిరి సలుపకుండా అయితే పడకటిల్లు దాష్టీకం అవుతుంది. 'అర్ధరాత్రి నడిరోడ్డు మీద ఆడది నిర్భయంగా పోవడం ఈ దేశంలో ఊహించడం తప్పని- గాంధి బతికివుంటే పట్టపగలే నిర్ధారించేవాడు. దీనికి జవాబు- స్త్రీలు సంఘటితపడాలి, పురుషులు చేయూత నిచ్చి దుర్మార్గాల్ని ప్రతిఘటించాలి.

'చెమటకాయలే పూసల పేర్లైనవారు, ఏరోజుకారోజు బతికేవారు, ఎండుటాకుల్లా ఎప్పుడో రాలిపోయేవారు, నేలతల్లి నిట్టూర్పును మాత్రమే నోచుకునేవారు, ఏ ఆశలూ లేనివారు, రేపటి చింతలేనివారు ఈ దేశంలో అడుగడుగునా కనిపించే దరిద్ర నారాయణులు, సూర్యోదయమే వారి మేలుకొలుపు. 'చీకటి తెర దించడానికి సూర్యుడు రాకతప్పదు, మేలుకొలుపు తప్పదు' అని ఫలశ్రుతి చెప్పారు కవయిత్రి. స్త్రీ విముక్తి జనవిముక్తితో మిళితమై ఉంది. సాంఘిక వ్యవస్థ మారినప్పుడే స్త్రీ విముక్తి సాధ్యం. అందువల్ల సాంఘిక వ్యవస్థ మార్పులో భాగంగానే స్త్రీ విముక్తి ఉద్యమం అభివృద్ధి చెందాలి. అందుకు భిన్నంగా, అతీతంగా, ప్రత్యామ్నాయంగా స్త్రీ విముక్తి అసాధ్యం. 'స్త్రీవాదులు' ఈ విషయంలో గందరగోళం లేపుతున్నారు.

ఈ కవితలు స్త్రీ 'స్వగతాలు'గా రాజుకొని సాంఘిక ప్రకాశాలై నిలదీస్తాయి. విప్లవాల యుగ సందర్భంలో కవయిత్రి ఆకాంక్ష విప్లవ అంతర్భాగంగానే ఉంది. సంఘీభావాన్ని కోరింది.

*'తల్లి కడుపులో బలికాని ఆడశిశువునై / వరకట్నానికి బలికాని వధువునై*
*విద్య నేర్చిన వివేకవతినై...*
*అసెంబ్లీ పార్లమెంటుల్లో అడుగుపెట్టి*
*చట్టాలను సవరించి అన్యాయాన్ని ఉరితీసి*
*దేశంలో కొత్త సంస్కారం విరజిమ్మాలని వుంది...*
*పూర్ణమ్మా, స్నేహలతాదేవిల్లా / నన్ను బలి కానివ్వకండి*
*మీ మధ్యలో నాకు నడవాలని వుంది / నాకు బతకాలని వుంది.'*

మాతృభూమి కోసం, స్త్రీ సమస్యల పరిష్కారం కోసం, నిరుపేదల సముద్ధరణ కోసం, రైతుల పోరాటాల కోసం పోరాడే యోధుల మధ్య మెలగాలని కోరడం ఈ సంపుటికి గొప్ప భరతవాక్యం. అది ఈ యుగం కోరుతున్న మమేకత్వం. అన్ని రంగాల పోరాటాలు ఒక్కచోట చేరి చేతులు కలిపి ముందుకు సాగినప్పుడే విప్లవం విజయవంతం అవుతుంది. 'మార్పు' కనిపించే కన్నీటినే గాక, కనిపించని కన్నీటినీ తుడుస్తుంది. యుగసంకల్పంతో మమేకం చెందడం కవయిత్రి నిబద్ధత.

'వంగిన నడుముల్లో నిటారైన చైతన్యాన్ని దట్టించదలిచిన దీప్తులు' ఈ కవితలు. 28 కవితలు స్త్రీల హక్కుల్ని, సమస్యల్ని అనేక కోణాల్లోనుంచి చూపాయి. నిరాశల్ని ఊదలేదు. నిస్సత్తువను కొలువలేదు. పురుషద్వేషాన్ని, కుటుంబ విచ్ఛిత్తిని, వివాహేతర సంబంధాల్ని, స్వలింగ సంపర్కాన్ని, కుటుంబేతర జీవితాన్ని ఈ కవితలు దగ్గరకు రానీయలేదు. సమస్యలవారీగా సంబంధాల్ని నిలదీశాయి. సంస్కారాన్ని ప్రశ్నించాయి. ఉన్నత సంస్కారాన్ని, సహజీవనాన్ని సమూలమైన మార్పును ఈ కవితలు ఆశించాయి. ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని చాటాయి.

సోదరి వాసా ప్రభావతిగారు పండితకవులు కావలసిన వారు. బాగా చదువుకున్నారు. భాషని గుప్పించగలరు, చిత్రికలు పట్టగలరు, అలంకారాల్ని ఊడిగం చేయించగలరు, ఉపమానాల్ని ఆడించగలరు.

కాని, వారు అలా చేయలేదు. కారణం- చదువుకోలేనివారు కూడా కవిత్వాన్ని ఆదరిస్తారని, చదువొచ్చినవారితో చదివించుకొని వాస్తవాలు తెలుసుకుంటారని 'అమ్మ' కవిత రాసిననాడే తెలుసుకున్నారు.

పండితుల కోసం, అక్షరవినోదుల కోసం కాక- చదువురాని వారి కోసం కవిత్వాన్ని రాశారు. ఆ కమిట్‌మెంట్ ఆవహించగానే భాష మారిపోయింది. మామూలు మాటలకు బలం వచ్చింది.

ఆడవారి దుఃఖాన్ని చూశారు. కరుణ- వీరంగా మారకపోతే కరుణకి ప్రయోజనం ఉండదు. స్త్రీని దుఃఖమూర్తిగా కాక, దుఃఖ నివారిణిగా తీర్చిదిద్దారు. ప్రతి కవితా స్త్రీ సమస్యను ప్రతిబింబించినా, ప్రతి సమస్యా పరిష్కారాన్ని చూపింది. అదే మకుటమైంది.

బాధపడేవారితో మమేకం చెందడం గొప్ప సంస్కారం. ఆ బాధను నివారించడానికి ఉద్యమించడం ప్రజాస్వామిక యుగధర్మాన్ని నెరవేర్చడం.

ప్రాణంలేని అక్షరాల్లో త్రాణ చూపడం, తద్వారా కవిత్వాన్ని మానవత్వానికి శీర్షిక చేయడం అది ప్రపంచ శాంతికి పావురం కావడం నేటి అవసరం.

నేటి అవసరాన్ని బాధ్యతతో నిర్వర్తించిన సోదరి వాసా ప్రభావతిగారికి విప్లవాభివందనలు. 'మళ్ళీ మళ్ళీ పుట్టే కవితా చైతన్యానికి జేజేలు.'

**- జ్వాలాముఖి**

**24-4-97 (గు) 3 గం.**

H. No. 2-3-64 / D,
721, Tirumala Nagar,
Amberpert, Hyd.- 13.

# అన్ని తరాల కవయిత్రి

– డా: సి. మృణాళిని

తెలుగు సాహిత్యంలో 1980ల తర్వాత కవిత్వం రాసిన స్త్రీలలో వినూత్న చైతన్యం కనిపిస్తుంది. అంతకుపూర్వమే కలం పట్టిన రచయిత్రులు కూడా ఆ తర్వాతినుంచి కొత్త సిరాను సమకూర్చుకున్నారు. స్త్రీల జీవితాలను భావుకతతో, ఆదర్శాలతో (మరోమాటలో చెప్పాలంటే పురుష దృక్పథంతో) చిత్రించడం మాని, స్త్రీల సమస్యల మూలాలను అర్థంచేసుకోవాలనే తపనతో రాయడం ప్రారంభించారు.

అలాంటి కొత్త చైతన్యాన్ని నింపుకున్న, నింపుకుంటున్న కవులలో డా: వాసా ప్రభావతి ఒకరు. సమకాలీన యుగస్పృహను తన కవిత్వంలో నిక్షిప్తం చేయడం వల్ల ఆమె తరాలకు అతీతమయ్యారు. నవతరం కవయిత్రులతో చేతులు కలుపుతూ, పాత తరం పాఠకులను జాగృతం చేస్తున్నారు.

సంస్కరణోద్యమకాలం నుంచి ప్రాధాన్యం సంతరించుకున్న సాంఘిక దురాచారాలు, మూఢ నమ్మకాలు, వరకట్నం, మానభంగాలు వంటి సమస్యల గురించి ఆవేదనతో, ఆవేశంతో రాయడం అంత కొత్తకాదు. కానీ, వాటినుంచి కొంత ముందుకు వెళ్లి, కుటుంబ హింస గురించి, పురుషాధిక్య సమాజంలో స్త్రీల అణచివేత గురించి రాసినపుడు వాసా ప్రభావతి ఈతరం కవయిత్రి అనిపించుకున్నారు.

'మళ్ళీ మళ్ళీ పుడతా...' అనే ఈ కవితాసంకలనంలోని 28 కవితల్లో కొన్ని సమకాలీన చైతన్యాన్ని నింపుకుని చక్కని సందేశం ఇస్తున్నాయి.

భర్త రాక కోసం నిరీక్షిస్తున్న ఒక సాధారణమైన భార్య మానసికావస్థతో ప్రారంభమయ్యే 'నిరీక్షణ' కవిత, భర్త కిరాతకం నుంచి విముక్తం చేసే కొత్త వెలుగు దిశగా చేసే ప్రయాణం కోసం నిరీక్షణ మొదలుపెట్టడంతో ముగియడం– చాలా చక్కని సందేశాన్నిచ్చే ఊహ.

కసాయి భర్త కోసం అర్ధరాత్రి వేచివున్న భార్య రూపంలో 'విరహోత్కంఠిత' కనిపించదు; నిలువెల్లా భయం కమ్ముకున్న 'విషాద జీవి' దర్శనమిస్తుంది.(నిరీక్షణ- పుట: 14)

**భయంకరంగా రాతి పాదాల చప్పుడు**
**మనిషి అడుగులు వేస్తున్నప్పుడు**
**బండరాయి రాతినేల మీద పడినట్లుగా**
**బండ గొంతుక అరుపులు...**
**భయం మీద పడి అదిమినట్లు మృత్యుదేవత చేతులు చాచి కౌగిలించుకున్నట్లు**
**బిగుసుకుపోతున్న శరీరం**

**తలుపులు బాదుతున్న శబ్దం**
**వణికే చేతులతో రావులు తప్పిన ప్రాణాలతో**
**ఆమె తలుపు గడియ తీసిన శబ్దం**
**అంత భయంలోను భర్తను చూడగానే**
**హృదిలో తెలియని రాగం!**
**కానీ, ఆ రాగాన్ని చిదిమేయడానికి భర్తకు ఎంతసేపో పట్టదు.**
**అందుకే...**
**చచ్చుబడిన మనసులో**
**సరికొత్త నిరీక్షణ**
**ఇల్లు వదలి- ఊరు వదలి**
**వెలుగు వెంట నడుచుకు పోతోంది.** – అంటారు కవయిత్రి. ఈ కవితని మొదటి భాగం సమస్యను గుర్తించడాన్ని సూచిస్తుంది. చివరిభాగం సమస్యతో పోరాడడాన్ని సూచిస్తుంది. మహిళా చైతన్యంలోని ఈ రెండు దశలు- ఉన్న స్థితిని గుర్తించడం, ఆ స్థితిపై తిరగబడ్డం- వాసా ప్రభావతిగారి కవితల్లోని ప్రధానమైన అంశాలు.

**ఆడవారి అడుగుల రాపిళ్లలో పుడుతుంది**
**ఆరని చైతన్యం** ( ఈ నేలంతా నీ అడుగు జాడలె!; పుట- 11) అన్నది ఈ కవితా సంకలనానికి థీమ్‌గా భావించవచ్చు.

డా: వాసా ప్రభావతి ఈ సంపుటంలో అవలంబించిన కంఠస్వరం ప్రబోధాత్మకమైంది. మహిళలు చేదు గతాన్ని, దుర్భరమైన వర్తమానాన్ని తిరస్కరించి, ఆశావహమైన, సామాజిక న్యాయం కలిగించే భవిష్యత్తును సాధించాలని ఉపదేశించడం, కవయిత్రి తనకు తాను ఆపాదించుకున్న కర్తవ్యం. అందుకే దాదాపు ప్రతి కవితా మహిళల జీవితాల్లోని దౌర్జన్యాన్ని, అణచివేతను, విషాదాన్ని చిత్రించడంతో ఆగిపోక, దానిపై తిరగబడాలనే సూచనతో ముగుస్తుంది.

అనేక కోణాలనుంచి స్త్రీ జీవితాన్ని స్పృశించిన కవితలు ఇందులో ఉన్నాయి.

పుట్టకముందే ప్రాణాలు కోల్పోయిన 'పిండం' నుంచి 'నాయనమ్మ' వరకూ, 'పనిపిల్ల' నుంచి వరకట్నానికి బలయ్యే 'నవ వధువు' వరకూ... అనేక దశల్లో స్త్రీ జీవితాన్ని ఈ కవితలు స్పృశించాయి. స్త్రీలను 'కదలిరండీ...' అని ఉత్తేజపరిచే పాటల్లాంటి కవితలూ ఉన్నాయి. మగవాడిని నిలదీసి ఖండించే బెదిరింపుల్లాంటి నినాద కవితలూ ఉన్నాయి.

మొత్తం సంకలనంలో కదిలించే, అబ్బురపరిచే కవిత... శీర్షిక కవితే. చిరునవ్వును స్త్రీగా సంకేతించడం చక్కని ప్రయోగం. ఒక్కొక్క సందర్భాన్ని వ్యాఖ్యానిస్తూ-

రాలిపోయిన చిరునవ్వును నేను;
గడ్డ కట్టిన చిరునవ్వును నేను;
జారిపోయిన చిరునవ్వును నేను;
చెదరిన చిరునవ్వును నేను;
కాలి బూడిదైన చిరునవ్వును నేను;
సిగ్గుతో ముడుచుకున్న చిరునవ్వును నేను;
కృశించి నశించిన చిరునవ్వును నేను.

– అన్న వర్ణన కవయిత్రి కవితాశిల్ప మర్మజ్ఞతకు తార్కాణం.

అయినా... ఈ సంకలనం కేవలం కవితాభిమానుల కోసం కాదు. సామాన్య స్త్రీలను జాగృతం చేయడం కోసం. కొద్దిపాటి అక్షరజ్ఞానంకల పాఠకులు కూడా అర్థంచేసుకోగల స్పష్టత, నిరాడంబరత, సూటిదనం డా: వాసా ప్రభావతి కవితా లక్షణాలు.

'స్త్రీచైతన్యం' సాహితీయుగ లక్షణంగా పరిణమిస్తున్న ఈరోజుల్లో ఒక సందేశాత్మక కవితాసంపుటిని అందించినందుకు డా: వాసా ప్రభావతిగారికి నా అభినందనలు.

**– డా: సి. మృణాళిని**

అసోసియేట్ ప్రొఫెసర్

పొ. శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం.

15.05.2002

హైదరాబాద్.

# మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా..!

మాతృమూర్తి గర్భగోళంలో
భద్రంగా పెరుగుతున్న నా జాడ తెలిసి
నన్ను ముక్కముక్కలుగ చేసి
పెంటకుప్పలో విసిరిన నాడు-
వాడి రాలిపోయిన చిరునవ్వును నేను.

నేను గండాలు దాటి
పుట్టి నేలమీద పడగానె
'అయ్యో! ఆడబిడ్డా... అంటూ
నా వెంట పడి వేధించిన నాడు-
భయంతో గడ్డకట్టిన చిరునవ్వును నేను.

పనిపాటలలో ఆరితేరినా
చదువులో ముందువున్నా
ఆటలలో అందెవేసినా
ఆడపిల్లకు వంటిల్లే గతి అని
ఇంటి చాకిరి నుదుటి రాతలని

నన్ను ఈసడించి అవమానించిన నాడు-
హేళన చేసి నవ్విన నాడు-
జారిపోయిన చిరునవ్వును నేను.

వేలకు వేలు కట్నాలు
వేలం పాటలో పోసి
మనసు కలవని
వరునితో తాళి కట్టించుకొని
బలిపశువులా వెంట నడిచిన నాడు-
చెదరిన చిరునవ్వును నేను.

వరకట్నం చాలదని
లాంఛనాలు తక్కువని
కిరసనాయిలు గుమ్మరించి
అగ్గిపుల్ల గీసిన నాడు-
కాలి బూడిదైన చిరునవ్వును నేను.

ఇంటెడు చాకిరి చేస్తూ
పిల్లపాపలను కని పెంచుతూ
ఉద్యోగము చేసి సంపాదిస్తూ
జీతమంతా భర్త చేతిలో గుమ్మరించి
బస్సు చార్జీలకై భర్త ముందు
చేయి చాచి అర్థించిన నాడు-
సిగ్గుతో ముడుచుకున్న చిరునవ్వును నేను.

ఆడదానివని, అబలవని
పతివ్రతవని పేర్లు పెట్టి
నడిబజారులో నగ్నంగా
మానభంగం చేసిన నాడు-
కృశించి నశించిన చిరునవ్వును నేను.

ఈ దురాగతాల ఒడిలో
మేల్కొంచి కళ్ళు తెరిచిన నేను
అనుభవం పెంచుకొని ఆలోచించిన నేను
ఈ ప్రకృతి అంతా నేనేనని
నాలో సగం పురుషుడని
నవరసాలు నాలోని నాదాలని
అవే ఈ లోకానికి వేదాలని తెలుసుకున్నాను.

అందుకే అత్యాచారాల అడకత్తెరలో
కాలు నిలదొక్కుకొని
ఆడపిల్ల బతికి బట్ట కట్టేవరకు-
ఆడువారి పెదవులపై
చిరునవ్వులు విరజిమ్మేవరకు-
పునర్జన్మలంటూ ఉంటే
మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా...
ఈ భారతంలో- మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా!

– కృష్ణా పత్రిక, 1989

# ఓ తల్లి

చల్లని వెన్నెల దుప్పటిలో
ఊరంతా హాయిగా నిద్రపోతుంటే
పాల నురుగులాంటి పాన్పుపై
భర్త కౌగిలిలో కరిగిపోవాలని
ఉవ్విళ్ళూరే మనసును
తన వెంట తిప్పుకుంటూ...

నిద్ర ఎరుగని ఎర్రటి కళ్ళను
చీకటి ఇంటిలో జ్యోతుల్లా వెలిగించి
పగటి పనుల అలసటలో
కదలలేనని మొరాయిస్తున్నా
శరీరాన్ని తోపుడు బండిలా తోసుకుంటూ...

రోగాల బాధలు,
లోకంలోని అన్యాయాలు, అక్రమాలు
ఆ పసి హృదయాన్ని
పట్టి పీడిస్తుంటే...

గుక్కపట్టి ఏడ్చే
పసివానికి ఔషధంలా
వక్ష స్థలానికి హత్తుకొని
చల్లని చేతితో ఒళ్ళంతా నిమురుతూ...

'నీకు నేనున్నా బాబూ-
కవచం లాంటి నేనుండగా
భయమెందుకురా బాబూ!'
అంటూ ఓదారుస్తూ
ఇల్లంతా తిరిగే ఆ యిల్లాలికి
ఆత్మవిశ్వాసమే ఆభరణం.

రాక్షసి కోరల్లాంటి రేపటి లోకాన్ని
క్రూర మృగాల్లాంటి కొందరిని తలచుకుని
నిద్రలో కెవ్వున అరచిన ఆడపిల్లను
'భవిష్యత్తంటే కారడవి కాదు-
కష్టాలు కన్నీళ్ళు శాశ్వతాలు కావు-
నీకు నేనున్నా... బెంబేలు పడకమ్మా!'
అంటూ ఆ పసి హృదయాన్ని
జో కొట్టి, జోల పాడి
నిద్రపుచ్చే ఆ తల్లికి
అనుభవసారమే తోడు.

ఆ పసిపిల్లల గూటికి
కాపలా సిపాయి ఆమె.
ఈ విశాల అవనిలో
ఓ తల్లి ఆమె.

– వనిత... ఆగస్టు 1994

# ఇంకా తెల్లవారలేదు

పది వసంతాలు నిండని
ఆ పసిపిల్ల చేసే పని
పదిళ్ళ చాకిరీ కంటే ఎక్కువే!
ఆ యింటిలో ఆ పసిబాల అనుభవం
నూరేళ్ళ అనుభవం కంటే అధికమే!!

బూరాలా పొంగవలసిన ఆ బాల ఉదరం
ఆకలి చిచ్చులో కాలిన వంకాయలా
ముడతలు పడి ముడుచుకు పోయింది.
పెరిగే మొక్కలా పెరగవలసిన ఆమె శరీరం
రానురాను కురుచై నేలకు వంగి పోతోంది.

ఉదయాస్తమయ వేళలో
ఆ యింటి ముంగిటిలో
చందమామ పలకరించే ఏకైక నేస్తమామే!
వేళ తప్పక నిద్రలేచె ఆమె కాలిసవ్వడులు
ఉదయించే సూర్యునికే కోడి కూతలు.

నడివీధిలో తోటి వయసు వారు
కేరింతలు కొడుతూ ఆడుతుంటే
పొంగివచ్చే ఆనందం గుండె గదుల్లో
ఊపిరి సలపక కువకువ మంటుంటే
కటకటాల మధ్య ఖైదీలా
కాళ్ళుండీ ముందుకు అడుగు వేయలేని
అవిటి పిల్ల ఆమె.
నోరుండీ పలుకలేని
మూగజీవి ఆమె.

పగిలిన అరికాళ్ళ, అరిచేతుల మంటలు
గుండెను పుండు చేస్తుంటే
అమ్మ ఒడిలో వాలి
కరువుతీరా ఏడ్వాలనే కోరిక
ఆ పసిపిల్లకు ఎండమావే!

పదో పరకో కన్నవారి చేతిలో పెట్టి
ముక్కుకు తాడువేసి
గొడ్డులా ఈడ్చుకువచ్చి
ఇంటిరాటకు కట్టి వేసిన
బలిపశువు ఆ పసిపిల్ల.
తరాలు గతిస్తున్నా
విజ్ఞానం పెరిగి గ్రహాల మీద తిరుగుతున్నా
బడికి వెళ్ళి చదువుకోవాలనే ఆశ
ఆమె బతుకులో అడియాసే!

ఇంటెడు మంది రుచులు నాక్కుంటు లేచాక
ఎండి మేకుల్లా ఉన్న ఎంగిలి మెతుకులతో
కంపుకొడుతున్న పాచికూరలతో
కడుపు నింపుకునే ఆకలి బతుకు ఆమె.

పెద్ద చిన్న భేదం లేకుండా
ఇంట్లో ఉన్న వారందరికి వెన్నెముకై నిలబడాలి.
ఆ పిల్ల మాత్రం ఎముకే లేక
బొంగరంలా ఇల్లంతా తిరగాలి.

చేసే బండ పనులకై
తన చిన్ని చేతులను పెంచి పెద్ద చేసుకోవాలి.
పొరపాటు జరిగితే
దవడో, వీపో, తలో పగిలిపోతుంది.
ఇంట్లో అందరి మురికి కడిగి శుభ్రం చేయాలి-
ఆమె మాత్రం ఆ చీకటి మురికిలోనే జీవించాలి.

ఏమీ తెలియని బాల్యమైనా
అన్నీ తెలిసిన వేదాంతి ఆమె.
వయసు వచ్చి ఈ చిన్నారి- పొన్నారియైతే
ఆ యింటిలోని ఏ గ్రద్ధ పొడిచి తింటుందో తెలియదు.
అందరూ ఉన్నా ఎవరూ లేని అబల ఆమె.

నీతులు చెప్పే మూర్ఖులు
ఈ దేశంలో కొల్లలైనా
ఆమె రాతలు మార్చే నేతలు మాత్రం శూన్యం.
స్వరాజ్యం అర్ధరాత్రి వచ్చింది కదా-
అందుకే... ఆ ప(సి)ని పిల్ల
బతుకు వాకిటిలో
ఇంకా తెల్లవారలేదు.

– *భూమిక... ఏప్రిల్ – జూన్ 199*

# దోపిడీ

పెళ్ళినాడు అర్ధాంగి వని
అందరి ముందు ప్రమాణాలు.
మూడు నాళ్ళు దాటాక
ఇంటికి బానిస యిల్లాలని
వంటికాలుపై సవాలు.
కట్నం తెచ్చిననాడు-
ముద్దు ముద్దుగ మాటలు విప్పడం..,
జీతం తెచ్చిననాడు-
నవ్వు పులుముకుని పర్సులు తడమడం..,
ఏదీ లేనినాడు-
జేవురించిన ముఖంతో దేహశుద్ధి!

కాలచక్రం ఆగలేదు
నడుస్తూనే ఉంది.
దేశం ముందడుగు వేస్తూనే ఉంది.
పురుషుని దోపిడీ మూడు పువ్వులు
ఆరు కాయలుగా సాగుతూనే ఉంది.
ఎప్పుడో ఒకప్పుడు భళ్ళున తెల్లవారుతుంది.
ఈ దోపిడీకి తెరపడుతుంది.

*– వనితాజ్యోతి... 15-5-84*

# ఈ నేలంతా నీ అడుగుజాడలే!

వంటింట్లో నాలుగు గోడల మధ్య బంధించిన పిల్లి
పులై గాండ్రిస్తే
పిరికిపందల మతులకు తిరోగమనమే!

చావు దెబ్బలతో బతుకులు బండబారిపోతుంటే
సంసారాలు ఓటి కుండలై పగులుతుంటే
మట్టిపుంతల్లో నుంచి నడుచుకొచ్చిన
మట్టి గాజుల చేతులే
మద్యపానానికి వేశాయి అరదండాలు.
మంచి గంధంలా పరిమళించే మంచితనమే
అమాయకత్వమై నలుగుతుంటే
పొగబారి కపురు కంపు కొడుతున్న
వంటిళ్ళలోని పసుపు పారాణి
ఆరని కోడళ్ళ చితిమంటలే
కారు చిచ్చై ఆవహిస్తుంది..,
వరకట్న దురాచారమె అల్లాడి
కాలి బూడిద రాశవుతుంది.

హుసేన్ సాగర్‌లో మురుగు
కంపు కొడుతున్న అబలల శవాలనుంచే
పుట్టుకొస్తుంది ఎప్పటికైనా
చల్లని నీటిపొరల్లో దాగున్న బడబాగ్ని శిఖలై.

గుండె భాండాగారాల్లో తరగని సిరుల్లా
దాచుకున్న ప్రేమాభిమానాలె
సలసల మరిగి ఉవ్వెత్తున పొంగి వస్తే
మానభంగాల భస్మాసురులు నుసికాక మానరు.

ఏనాటి నుంచో ఎదురుచూస్తున్న
పూర్ణమ్మా, స్నేహలతాదేవి ఆశయాలు
నెరవేరక మానవు
ఆడువారి అడుగులు రాపిళ్ళలో పుడుతుంది
ఆరని చైతన్యం.
సుప్రభాతంలోని నునువెచ్చని సూర్యకిరణాల్లా
ఈ లోకమంతా నువ్వే!
ఈ నేలంతా నీ అడుగుజాడలే!

– వనిత... అక్టోబర్ – 1996

# పచ్చని ఆశ

ఎక్కడో దూరంగా ఆకాశంలో
నల్లని మేలి ముసుగులతో
దొంగ మబ్బులు
చెమ్మచెక్క లాడుతుంటే
ఆ రాతి అరచేతి చప్పట్లలో
చెలరేగిన ఉరుముల నినాదాలలో
తళుక్కుమనే మెరుపు తీగల
చమత్కారాలకు మురిసి
వీధులు దాటి కడవలతో
నీటిని మోసుకువస్తున్న
ఆ తల్లి పేగు వెర్రిఆశతో
ఏనాడో కురిసిన స్వాతి జల్లులు
మదిని కుదపగా
పోయిన యేడు జల్లుజల్లున కురిసిన
జడివానలు తలచుకుంటూ
కళ్ల ముందు తెరలు కట్టిన
పాదంలోతు నేలపై పారే
వాననీటిలో నావలా సాగుతూ
చమటతో తడిసిన బట్టనుండి
వచ్చే వింతవాసన వికార పెడుతున్నా
బరువు బిందెను నేలకు దించి
మొద్దెక్కిన భుజాలను
తడుముకోవాలని తహతహలాడింది.

ఆ నేలను తడపకుండానే
గాలి తాకిడికి వాటుగా
ఉరకలువేస్తూ, పరుగులు పెడుతూ
కంటికి దూరమవుతున్న
ఆ పెంకి మేఘాల అలజడికి
మనస్సు చివుక్కుమని
నిరాశతో కళ్లలో నీళ్లు గిర్రున తిరిగినా
నిలిచిన నేల కదలినట్లయినా
ఎక్కడో గుండె పొరల మాటున
ముడుచుకొని పడుకున్న ఆశ
పసిగుడ్డులా రెక్కలు విప్పి కదలాడింది.
ఆరిపోతున్న దీపం
తిరిగి వెలుగుతుందనే
ప్రమిదకున్న దోసెడు ఆశలా
ఆకులు పండి రాలిపోయినా
తిరిగి చిగురించాలనే
చెట్టుకున్న బారెడు ఆశలా
ఎండి మోడైనా సుగంధాలు పరిమళించాలనే
మంచి గంధపు మోడుకున్న
కొండంత ఆశలా
ఏ నల్లని పిల్లమేఘమో విచ్చేసి
మదిలో పదిలంగా ఉండే
అనురాగ శాఖను కుదిపి
జల్లుజల్లున కురిసిపోతుందనే
ఆకాశమంత ఆశతో
ఎండి ఆరిపోయే పసిపిల్లల నోరు తడపాలని
ఆ తల్లి నీటి కడవను మోసుకుంటూ
పచ్చని ఆశతో గడపవైపు సాగింది.

– ఆంధ్రప్రభ... 1995

# నిరీక్షణ

ఊరంతా చీకటి సాలెగూడులా అల్లుకుంది.
ముడిచిన తెరలా వెలుగు కనుమరుగైపోయింది.
కొన్ని జీవులు చీకట్లో స్వేచ్ఛగా నర్తిస్తున్నాయి
కొన్ని జీవులు ప్రాణభయంతో ఊపిరి వదలడానికే
భయపడుతూ ముడుచుకు పడుకున్నాయి
అందరిళ్ళలో దీపాలు మిణుకు మిణుకుమంటూ
అర్ధరాత్రిని సూచిస్తున్నాయి.
ఆ యింట్లో దీపం మాత్రం ఆ యిల్లాలి
ముఖం వైపే చూస్తోంది.
వీధి గుమ్మం దగ్గర నిలబడ్డ ఆమె చూపులు
తలుపునిండా చిత్రాలు గీస్తున్నాయి.
వర్షపు ధారల్లా తెరలు తెరలుగా వస్తున్న
కన్నీటితో పయట తడిసి ముద్దవుతుంది.
ముక్కురంధ్రాల నుండి బుసలు కొడుతున్న
వేడి నిట్టూర్పులతో గది వేడి ఎక్కింది.
అంతలో... ఏదో చప్పుడు-
భయంకరంగా రాతిపాదాల చప్పుడు!

మనిషి అడుగులు వేస్తున్నప్పుడు
బండరాయి రాతినేల మీద పడినట్లుగా
బండ గొంతుక అరుపులు.
దగ్గరలో పిడుగు పడినట్లు
ఉలిక్కిపడ్డ పక్షుల ఆర్తనాదాలు.
అది విన్న ఆమె శరీరంలో ప్రకంపనం.
భయం మీదపడి అదిమినట్లు
మృత్యుదేవత చేతులు చాచి కౌగిలించుకున్నట్లు
బిగుసుకుపోతున్న శరీరం.
తలుపులు బాదుతున్న శబ్దం.
వణికే చేతులతో, తావులు తప్పిన ప్రాణాలతో
ఆమె తలుపు గడియ తీసిన శబ్దం.
తలుపులు తెరుచుకున్న కిర్రుశబ్దం.
అంత భయంలోను భర్తను చూడగానె
హృదిలో తెలియని రాగం-
మదిలో నునువెచ్చని గానం!
విషభాండంలో తీయని మధువు బొట్టు
కలిసిన సందడి.
ఒక్కక్షణం- నిరీక్షణ.
ఒక్కరోజు భర్త మత్తుపానీయం
ముట్టకుండా యింటికి తిరిగి వస్తే
ఆమె జీవితానికో వసంతం.
ఇది కోరరాని కోరికా? కాదు! కాదు!
సంసారంలో సరిగమలే!
చుట్టుపక్కలవారు చర్చించుకోడానికో విషయం.
అవమానంతో శరీరంలో సన్నని వణుకు.
ఏ తప్పు చేయని తనకు
అర్ధరాత్రి వరకు అతనికోసం నిరీక్షిస్తూ
ఏ సుఖం కోరని తనకు చావుదెబ్బలు.
ఈ అవమానం కంటే ఉరిశిక్ష నయం.

క్రూర మృగంలా గాండ్రిస్తూ
భర్త చేతి సమ్మెట పోటులు.
తన తప్పు తనకు తెలియదు.
సమాధానం వినని ఆ వ్యక్తి మూర్ఖత్వం.
పెదాలు, ముఖం, నరాలు చిట్లి
నేల కారుతున్న రక్తం.
సమాజం కళ్ళు తెరచిచూడదు
నోరువిప్పి మాటాడదు.
'వాడి పెళ్ళాం... వాడి యిష్టం!
కొట్టుకుంటాడు- చంపుకుంటాడు
వాడిష్టం... వాడికా హక్కు ఉంది.'
పచ్చని చెట్టు నేలవాలినట్లు
కుప్పకూలిన శబ్దం.
దాహంతో నోరెండి పోయింది-
బాధలతో మనసు మూగవోయింది-
చావుదెబ్బలతో ప్రాణం ఎటుపోయిందో!
తెలివి వచ్చేసరికి చుట్టూ పరుచుకున్న వెలుగురేఖలు
జిలిబిలిగా అల్లుతున్న పందిళ్ళు.
సర్వం పోయి, నా- అన్నది మిగలకపోయినా
ఏదో కోరిక! బతకాలనే తపన!
తనకు శక్తి తానే
తనకు ఆధారం తానె!
చల్లబడిన శరీరంలో కొత్త కదలికలు.
చచ్చుబడిపోయిన మనసులో
సరికొత్త నిరీక్షణ.
ఇల్లు వదలి- ఊరు వదలి
వెలుగు వెంట నడుచుకుపోతుంది.
ఈ దేశంలో ఒక ఆడది ఆమె.

– ఆంధ్రప్రభ వీక్లీ... 11-9-

# కళ్ళు తెరవకముందే

కవచకుండలాలు వలిచిన
కర్ణుని శరీరచ్ఛాయలా
తల్లి గర్భం నుండి నేలపడిన పసిపాప
వెచ్చని పొత్తిళ్ళ కోసం విప్పిన కొత్తగొంతు
మాతృత్వపు మాధుర్యానికే మేలుకొలుపు.

పాలుగారే వక్షస్థలాన్ని
రుచి తెలియని ఆ పసినాలుకకు అందించి
పమిట చాటున పదిలంగా దాచిన
ఆ తల్లి హృదయమంతా
కస్తూరి పరిమళంలా ఆ పసిపాపే!
రెండు పదుల అనుభవంతో
చూరుకు కట్టిన బట్ట ఊయలలో
కాలచక్రాన్ని తిప్పే కాలపురుషునిలా
బోసినవ్వుల పూలజల్లుతో మురిపిస్తోంది.
పొంచి ఉన్న తోడేలు కన్నతండ్రేయని తెలియక
తండ్రి ఎదపై వ్రాలి మురవాలని

తండ్రి చేయిపట్టి తప్పటడుగులు
వేసుకుంటూ బడికి నడవాలని
కలలు కంటున్న కన్నకూతుర్ని
మేకనో, కోడినో బలిచేసినట్లు
కళ్ళు తెరవని పసికందు పిడికిట పట్టి
పీక నులుముతుంటె
ముద్దులొలికే ముద్దమందారమై
తేనలొలికే నవపారిజాతమై
'అమ్మా! నన్ను కాపాడు' అంటూ
నోరు విప్పి మాటరాని ఆ మూగ స్వరూపం
ఈ నేలపై తన తల్లి కూడా ఒక ఆడదేనని
కన్నకడుపు కాపాడుకోలేని అశక్తురాలని
ఆ పసిగుడ్డుకేమి తెలుసు?

'ఓ తండ్రీ! నారు పోసిన నువ్వు
నీరు పోయనవసరం లేదు!
నాలుగు మెతుకులు కరిచేవరకు
చనుపాల కోసం అమ్మనే పీల్చిపిప్పి చేస్తూ బతుకుతా'నని,
'నడక నేర్చిన నాడు నా వెనుక చంటివానిని
చంకన మోస్తూ పక్కింటి పనిని
నెత్తిన వేసుకొని నా పొట్టనేకాదు.., మీ పొట్టలనూ
నింపే వంటపాత్ర నవుతా'నని,
'నువ్వు గుడ్డలు కొనకపోయినా
ఏ పాత చింపో అడుక్కువచ్చి చుట్టుకుంటా'నని,
తలనూనె ఎరుగని చింపిజుట్టుతో
'బడికిపోయి చదువుకుంటానని పేచీలు పెట్టక,
సరదాలు తీర్చమని మారాము చెయ్యక,
చీకటిలో నువ్వు చేసిన తప్పుకు
నువ్వు తీర్చుకున్న కామవాంఛకు చిహ్నంగా
నీ రక్తాన్ని పంచుకు పుట్టిన

పనికిరాని ఆడపిల్లను నే'నని ఏడ్చే ఏడుపుకు
నేల తల్లి ఉలిక్కిపడింది.
ఆకాశం కార్చిన కన్నీటితో
నదులు పొంగి ఊళ్ళను ముంచెత్తాయి.
లోకంలో ప్రళయం తాండవించింది.
ఆ కసాయి తండ్రి గుండె మాత్రం
కరిగి ఒక్క కన్నీటిబొట్టు రాల్చలేదు.

ఆ పసిదాని ప్రాణాలు బలవంతంగా తీస్తుంటే
గుండె బద్దలయిన అభిమానం
ఆడదై పురులు విప్పింది.
నేటి పసిపాపే రేపటితల్లిగా
ఈ లోకాన్ని మేలుకొలపాలని
కరడుకట్టిన మానవత్వాన్ని కుదిపి లేపాలని
కళ్ళు తెరవక ముందే కళ్ళు మూస్తున్న
ఆ పసిపాప గొంతు బిగించిన పిడికిళ్ళతో
కొత్త వెలుగుకోసం కలిపింది
మరో పసిపాప గొంతు.

– ఆకాశవాణి సౌజన్యంతో... 10–10–96

# నాయనమ్మ

పగలు వీధివాకిట్లో పిల్లల కోడిలా
పెరటిలో పచ్చనిచెట్టులా
పిల్లల్ని కవ్విస్తూ నవ్విస్తూ
అలుకలో మూతి ముడుచుకున్నవారికి
తాయిలం పెట్టి ఓదారుస్తూ
అవసరమైతే చంకన వేసుకొని బుజ్జగిస్తూ
లోకంలో వింతలు విడ్డూరాలు కళ్ళముందు నిలిపే
నాయనమ్మ- పెద్ద బాలశిక్షే!
నాయనమ్మ బతుకు వాకిట్లో
సూర్య చంద్రులు మనువలే!
రాత్రివేళ తాతయ్య తీపిజ్ఞాపకాలను
మిఠాయి పొట్లాలుగ కట్టి
జీవితానుభావాలు కథలుగా అల్లి
నిజం కలలుగ, కలలు నిజంగా వర్ణించి చెప్పే
నాయనమ్మ ఓ మాంత్రికురాలే!
అమ్మకి నాన్నకి నాయనమ్మ
ఓ పాత భోషాణం పెట్టె.

నాయనమ్మ మనసులో ఏదో వెలితి.
పదవి పోయిన మంత్రిలా కాస్త బాధ.
అప్పుడప్పుడు కళ్ళలో కాస్త తడి.
కొడుకు రాజ్యంలో కోడలు రాణి.
నాయనమ్మ పెరటిచెట్టు చాటునో
వంటయింట్లో గిన్నెల మాటునో
జాలిగా కళ్ళొత్తుకుంటుంది.
పని మనిషితోనో పక్కింటివారితోనో
తనగోడు చెప్పుకోవాలని ఎదురుతెన్నులు.
తాత బతికుండగా బంగారుగాజులతో
గుంటూరు జరీచీరలతో కళకళలాడిన నాయనమ్మ
సత్తుగాజులతో ముతకచీరలతో
అస్తమించే సూర్యునిలా వెలవెలబోతోంది.
కొడుకు చదువుకి ఉన్నదంతా ఊడ్చిపెట్టి
దీపస్తంభంలా మారింది నాయనమ్మ.
బోసిగా తిరుగుతున్న తల్లికి
నగలు చేయించే సంతానముంటుందా!
అలా ఉంటే వారికి చేతులెత్తి నమస్కరించవలసిందే!
అనుకుంటూ నిట్టూరుస్తుంది.
వడలిన మామిడి పండులా
ముడతలు పడ్డ శరీరంలో
కుంకుమ పూరేకుల్లా కనబడే
రక్తనాళాలు పీకుతూ లాగుతూ
పిల్లలు వింతగా ఆడుకుంటారు.
నాయనమ్మ వేడుకగా చూస్తుంది.
ఆరు ఋతువుల్లో కాలం మారినట్లుగా
నాయనమ్మ జీవితం ఆకులు రాల్చి చిగురిస్తూనే ఉంది.
హెచ్చుతగ్గు రేఖల్లో చిక్కి జీరాడుతూనే ఉంది.
కోడికూతకు ముందే లేచే నాయనమ్మ

నోరులేని పూలమొక్కలా
వేరు పురుగు పట్టిన చెట్టులా
నాయనమ్మ శరీరం కట్టెలా మారింది.
మాయదారి పేదరాశిపెద్దమ్మ
ఎత్తుకుపోయింది నాయనమ్మను.
పిల్లల ఏడ్పుల్లో నాయనమ్మ జ్ఞాపకాలు మిగిలాయి.
'నేనెక్కడికి పోతానురా!
నీ కడుపున పుడతానురా!' అన్న
నాయనమ్మ మాటలు వినబడ్డాయి.
పిల్లల ముఖాలు చూసుకుంటే
నాయనమ్మ రూపురేఖలు
కొట్టవచ్చినట్లు కనబడ్డాయి.
'నాయనమ్మ!
మా నాయనమ్మ ఇక్కడే ఉంది!'
నిజమే! కొందరి మనవలకే
నాయనమ్మ జ్ఞాపకాలు.

– ఆకాశవాణి సౌజన్యంతో... 10-10-

# చరమగీతం

మానవత్వం ఎరను చూపి విసిరిన వలలో చిక్కి
దిక్కుతెలియక అల్లాడుతుంటే
అదను చూస్తున్న దానవత్వం
పగటి కలల గుజ్జాలపై
మృత్యుకోరలు విప్పి
చేస్తున్న విలయతాండవం.
చల్లని మంచు బిందువులతో
బోసి నవ్వులు చిందించే నేల,
పచ్చని చెట్లతో పకపక నవ్వే భూమి
పచ్చినెత్తురుతో తడిసి
దురాచారాల ఇనుపపాదాలకింద
నలుగుతున్న ఆడదానిలా విలవిల్లాడుతోంది.
భయాందోళనల చక్రాలలో నలుగుతున్న
జనం గుండెలు అవుతున్నాయి చెక్కలుముక్కలు.
కులాలు, మతాలు, సంఘనటలు వేరు.
వంటిల్లు, పడకగది, నడిరోడ్డు
ప్రదేశాలు వేరు –

ప్రేమించడం కూడా ప్రమాదానికి పిడిబాకే!
అవునంటే కట్నం లేదని
నిలువునా కాల్చివేతలు
కాదంటే కత్తులకు పదును.
కసాయివారై కుత్తుకల ఉత్తరింపు.
అందాన్ని కొలుచుకుంటూ కొంగుపట్టి తిరిగినవారే
పెళ్ళినాడే ఈర్ష్యతో బుసలు కొడుతున్నారు.
ఆమె కామేశ్వరి కావచ్చు,
అఫ్సానా కావచ్చు-
దారుణ మారణకాండ ఒక్కటే.
నాలుగురోడ్ల కూడలిలో ఆమె రోదనం
అరణ్యరోదనమే!
ఆమె పెట్టిన పెడబొబ్బలు
ఏ గుండెను తాకకుండానె
ఈ జనారణ్యంలో కలిసిన ప్రతిధ్వనులు.
చేతికంటిన రక్తాన్ని నోరులేని నేలకురాసి
అందుకుంటున్న అంతస్తులు.
బడికో, గుడికో వెళ్లిన ఆడపిల్ల
ఆశలేదు క్షేమంగా ఇల్లు చేరుతుందని!
ఏ యింటి ముంగిట్లోనో పెరిగిన
ముళ్ళ పొదలో పొంచి ఉన్న తోడేళ్లు
కండలు పీకుతాయన్న భయం!
ఇంట్లో వంటరిగా ఆడపిల్లను వదిలితే
మనిషితోలు కప్పుకున్న పెద్దపులులు
మానప్రాణాలు మట్టుపెడతాయన్న భయం!
అడుగడుగునా రక్షకభటులున్నా
రాక్షస జనసంచారంలో రక్షణే కరువు.
ఈ స్వతంత్ర భారతావనిలో మనిషి
కళ్ళు, చెవులు, నోరూ ఉన్నా
ఏమీలేని రాతిబొమ్మే!

అయినా ఎవర్నని ఏమిలాభం?
స్వరాజ్యం వచ్చి 50 సం॥రాలు అవుతున్నా
మా కాళ్ళ మీద మేం నిలబడలేం-
మా నోటితో మేం పలకలేం!
కాగితాలపై రాతలు-
వేదికలపై కోతలు-
హేళనలూ.., వెక్కిరింపులు!
అర్థబలమున్నా అంగబలం లేనివారం-
దేహబలమున్నా ఆత్మబలం లేనివారం-
ఐక్యతాబలాన్ని అందుకోలేనివారం-
వాదాల బడిలో పెరుగుతున్నాం!
కళ్ళ ఎదుట కనిపిస్తున్నా మాకు తెలీదనేవారు-
కళ్ళ మూసుకుదాటేవారు-
స్వార్థంతో నిండి కాలంనెట్టుకొస్తున్న మనుషులు!
అయినా... ఏదో ఆశ!
చీకటి రాత్రిని చీల్చుకుంటూ
సుప్రభాత మవుతుందనే ఆశ!
ఎప్పటికైనా పిడికిళ్ళు బిగించి
ముందుకు అడుగులు వేస్తారన్న ఆశ.
తిరోగమనం ఎరుగని మహాప్రస్థానం-
స్త్రీలోకంలో మరో కొత్త సూర్యోదయం!
అదే ఈ దహనకాండకు,
ఈ దమనకాండకు చరమగీతం!!

... 7-8-96

# వెన్నెల పంచుకో !

భార్యను 'ఏమే... అనడానికి
తడబడుతున్నాడు భర్త.
మరి భార్య 'ఏరా... అంటుందని
భయం కాబోలు!

భార్యవెంట బజారుకు వెళ్లాలంటే
భయపడుతున్నాడు భర్త.
సరుకులసంచీ, చంటివానిని చెరో చేత్తో
మోయిస్తుందని భయం కాబోలు!

చదువుల్లో బంగారు పతకాలు-
మెరిట్‌లో ఉద్యోగాలు- అన్నీ అమ్మాయిలవే!
మరి ఇకపై మగ పిల్లలు చేయాలి సమ్మెలు రిజర్వేషన్లకై!

స్కూటర్లు, కార్లు, విమానాలు
నడుపుతోంది నేటి మహిళ
ఆడది గైడయినప్పుడు వెనుక బుద్ధిమంతునిలా
కూర్చుంటున్నాడు పురుషుడు.
భర్తను అందరి ఎదుట యెదిరించకే చెల్లీ!
ఎంత పెద్దవాడైనా చాటున నీ భర్త నీ మాట వినకమానడు.
వివేకంతో మసలుకొని తోటివారిని ఆకట్టుకో!
తెలివిగా జీవితాంతం వెన్నెల పంచుకో!

*- మహిళా కాలేజీ కవిసమ్మేళనం... 18-3-8*

# ఇంతకీ... ఎవరు నీవు?

అందమైన రెక్కలు ఉన్నా
ఈ ప్రపంచంలో ఎగురలేని
పక్షిపిల్లవు నీవు.
చదువు, డిగ్రీలు ఉన్నా
స్వతంత్రంగా ఆలోచించలేని
పసిపిల్లవు నీవు.
ఉద్యోగం చేస్తున్నా
పైసా వెనకేసుకోలేని
వెర్రిదానవు నీవు.
ఎవ్వరెన్ని ధర్మాలు బోధించినా
వినుగులేని కర్ణభేరి నీవు.
మమతను దాచుకోకుండా
అందరికీ పంచాలని తాపత్రయపడే
తలలో నాలుక నీవు.
వళ్ళు దాచుకోకుండా
పనులు చేసుకుపోతావు.
ఎవరే వల విసిరినా
తప్పించుకోలేని దానివి.
ఎన్ని చట్టాలు ఉన్నా
ఉపయోగించుకోలేని
అమాయకురాలివి నీవు.
ఇంతకీ... ఎవరు నీవు?
ఈ దేశంలో పుట్టిన ఆడదానివేగా!

– 'న్యాయవాణి'... న్యూఢిల్లీ, మే 94

# యువతులకో పిలుపు!

స్వరాజ్యం వచ్చిన 45 వత్సరాలకి
మహిళల్లో ఏదో వెచ్చని సంచలనం!
మహిళా కళాశాలల్లో కవిసమ్మేళనాలు.
హంగులు దిద్దుకుంటున్న మహిళా ప్రగతి
రేపటి రంగుల హరివిల్లు.

విద్యనేర్చుకుంటూ, విజ్ఞానం పేర్చుకుంటూ
బాలభానులై- భావిపౌరులై
నవభారత రథ సారథులై
ఉడుకు రక్తం పొంగి పొరలే యువతుల్లారా!
మత్తుపానీయాలు చిత్తు చేస్తున్నాయి-
మానవాళి శక్తియుక్తులను.

కామాంధులవలె పడిఉన్నారు-
కల్లుపాకల కాళ్ళమీద.
ఇల్లు మరచి, ఇల్లాలిని మరచి,
కన్నపిల్లలను మరచి-

కల్లు సారాలె గతి అంటున్నారు.
మత్తుపానీయాల దుమ్ము దులపగ
చైతన్యనేత్రం తెరచిచూడగ
రండి! రండి! కదలిరండి... యువతుల్లారా!

వరకట్నపు రాక్షసి కోరల నీడల్లో
కాబూలివాలా కంటె కఠినులై
తలారులై ఇంటి కోడళ్ళ
తలలు ఉత్తరించె అత్తింటి ఆగడాలు
ఇకపై సాగనీక, స్వస్తి చెప్పగ
రండి! రండి! కదలిరండి.

అన్యాయాలతో, అక్రమాలతో
మానభంగాల కాట్లకు కాట్లువేయ
తటతటలాడె భరతావని చక్కచేయగ
ధర్మదేవత కళ్ళు తెరిపించగ
న్యాయదేవత నిద్రలేపగ
రండి! రండి! కదలిరండి.

మతారాజకీయాల బేషరతులకు లొంగి
చేతులు ఊపే రాజకీయ
బానిసల నుండి దేశాన్ని సంరక్షింపగ
రండి! రండి! కదలిరండీ!

ముఖాలకు ముసుగువేసుకుని
ముఖస్తుతులు చేస్తూ
వీపులు కనబడగానె
నాలుకలు మడచుకుంటూ
సొంత కీర్తనలు పాడుకుంటూ
నలుమూలల తిరిగేవారి

కౌగిలినుండి దేశాన్ని కాపాడగ
రండి! రండి! కదలిరండీ!

అణువణువున వీచే
ఈ స్వేచ్ఛాగాలులు మీవని
జలజలపారే సముత్తుంగ
తరంగ జలధారలు మీవని
ఛంగుఛంగున ఎగసిపడే
ఉత్సాహం మీదని
ఈ స్వేచ్ఛా భారతావని
సంరక్షింపగ... భారత భావిపౌరుల్లారా-
రండి! రండి! యువతుల్లారా... కదలిరండి!

*– మహిళా కళాశాల కవిసమ్మేళనం... 27-1-9*

# వెలిగే బతుకులు

చేతికి అందం- రంగు రంగుల గాజులు కావు.
ఆ గాజుల గలగలలో స్వేచ్ఛగా ధ్వనించె
నిత్యనూతన చైతన్య కార్యభారాలు.
కాలికి అందం- బరువుగా కదిలె అందెలు కావు.
ఆ అందెల చిరుమువ్వల స్వేచ్ఛారవళిలో
మున్ముందుకు సాగె అడుగుల సవ్వడులు.
వక్షస్థలానికి అందం-
ఖరీదు చేసె కాసులపేరులు కావు.
ఆ పేరుల మధ్యలో వెలిగే స్వేచ్ఛాపతకంలా
ఈ సువిశాల ప్రపంచాన్ని ఆరాధించే ఆశయం,
జనావళిని సేవించే విశాల హృదయం.
చెవులకు అందం- రవ్వల కమ్మలు కావు.
ఆ రవ్వలు విరజిమ్మే స్వేచ్ఛాకిరణాల్లా
శ్రవ్యానందం గూర్చే మాటల మూటలు.
తలకు అందం- నల్లని వాలుజడల సోయగాల
నిండా పరుచుకున్న పూమాలల బారులు కావు!
తలలోని మెదడులో స్వేచ్ఛగా

వికసించే ఆలోచనల తళతళలు.
సొంతరెక్కలు విప్పుకుని ఆకాశంలో
నిశ్చలంగా, నిర్మలంగా శ్రమకు భయపడక
తమ శక్తిని కొలుచుకుంటూ
ఎగిరే ఆ పక్షుల స్వేచ్ఛ
అడుగడుగున కావాలి అందరికి.
అలంకరణలు అందాన్ని
పంచి పెట్టగలవు కాని-
బాణంలా దూసుకుపోయే
ఆలోచనలకు పదును పెట్టలేవు!
మెర్క్యురీ లైట్ల కాంతులు
పగటి కాంతిని జయించలేవు.
స్వేచ్ఛలేని ఆలోచనలు
వెలిగించలేవు జీవితాన్ని.
స్వేచ్ఛ ఒకరు ఇచ్చేది కాదు-
స్వేచ్ఛ ఒకరు పంచేది కాదు.
అందుకునేది స్వేచ్ఛ-
ఆచరించేది స్వేచ్ఛ..!
ఉదయ సంధ్యారాగంలో
తీగల్లా సాగే
సూర్యకిరణ మాలికల్లా
స్వేచ్ఛతో వెలిగే బతుకులే
అసలు వెలుగురేఖలు ఈ లోకానికి.

*-వనిత... ఏప్రిల్ (ఉగాది సంచిక) 199*

# ఓ 'మగడా'

ప్రేమ ప్రేమంటూ వెంటబడ్డావు!
నీవు లేనిదే బతకలేనన్నావు!
కాదంటే దేవదాసు నేనన్నావు!
అవునంటే మావారి నడగాలన్నావు!

ఆస్తులు, అంతస్తులు, ఆర్భాటాలు
కట్నాలు, కానుకలు మావారికన్నావు!
అవి లేనిదే పెళ్ళే కాదన్నావు!
మరి ఈనాడు మావారి అడుగులకు
మడుగులొత్తాలంటున్నావు?
పుట్టింటి నుంచి పైసలు మోసుకు రావాలంటున్నావు!

నీ కాళ్ళ మీద నువ్వు నిలబడలేవు?
నీ మాటకు నువ్వు కట్టుబడలేవు?
నీ బాటలో నువ్వు సాగలేవు?
ఓ మగడా! సామర్థ్యం లేని నీ సాహచర్యం
కంచాన్ని చూసి భోజనానికి కూర్చున్నట్టే!

పెద్ద చదువులు చదువుకున్నావు!
బళ్ళకొద్దీ విజ్ఞానం పెంచుకున్నావు!
అప్పనంగా దొరుకుతోందని
కట్నానికి గంగిరెద్దులా తలాడిస్తూ
అమ్మాయికి అమ్ముడుపోతున్నావు!
దురాచారానికి గొడుగుపట్టి
అల్లకల్లోలం సృష్టిస్తున్నావు!

ఓ మగడా! ఆశయాలు ఎండిన
ఎడారిలో బతుకుతూ
ధనానికి బానిసవైన నీతో కాపురంకంటె
బ్రహ్మచారిణిగా బతకడం మేలు!

తల్లి మాటవిని పెళ్ళాన్ని బూడిద చేస్తావు!
పెళ్ళాం మాట విని తల్లిపై చెయ్యెత్తుతావు!
ఇల్లే నరకం చేసి, మనశ్శాంతి పోగొట్టి
పచ్చని జీవితం ఎండుటాకు చేస్తున్నావు!

కాలం కలిసి రాలేదంటూ-
జాతకాలు నప్పలేదంటూ
పనికిరాని మాటలు వల్లిస్తూ
ముఖాన్ని దాటేస్తూ తిరుగుతున్నావు!

నిన్ను నీవు తెలుసుకునేదెప్పుడు?
నీ సామర్థ్యం పెంచుకునేదెప్పుడు?
కనురెప్పపాటు కాలంలో
ముగిసిపోయే జీవితకాలంలో
తల్లిని, పెళ్ళాన్ని సరిగా చూసేదెప్పుడు?
ఓ మగడా! వ్యక్తిత్వం లేని నీతో కాపురం-
బాంబులున్న భవనంలో నివాసమే!

చదువే ముఖ్యమన్నావు!
అందమే ఆనందమన్నావు!
కళారాధనే ధ్యేయమన్నావు!
ఆశయమే ప్రాణమన్నావు!
తాళి కట్టిన మరునాడె
కాళ్ళకు సంకెళ్ళు వేసి కడపే దాటనివ్వవు?
బయటి ప్రపంచం చూడనివ్వవు?
మనసుకు, మాటకు గంతలు కట్టి
వంటయింటికి అంకితం చేస్తావు!

ఆడదంటే ఆటబొమ్మ అనుకుంటున్నావు?
క్రౌర్యపైత్తనం నీ వారసత్వమనుకుంటున్నావు?
ఓ మగడా! హృదయం లేని
నీతో పాణిగ్రహణం కంటే
సమాజంలో సబలగా బతకడం మేలు!

*– భూమిక... ఏప్రిల్ - జూన్ 1996*

# అమ్మకు కావాలి అమ్మాయే!

అమ్మా, నేలతల్లి ఒక్కటే!
ఉభయ సంధ్యల తేడాలు తెలీకుండా
కాలాన్ని ముందుకు నడిపిస్తూ ఉంటారు.
కంటికొలకుల్లో అలసట దాచిపెట్టి
శ్రమపడుతూనే ఉంటుంది అమ్మ.
చారెడు సుఖం చూసుకోకుండా
ముక్కు మొఖం తెలియని చిన్నారులను
చిటారుకొమ్మలకెత్తాలని
నగిషీలు చెక్కుతూనే ఉంటుంది.
జీవిత పాఠాలు నేర్పుతూనే ఉంటుంది.
చేనుకు కంచెలా కళ్ళు వత్తులుచేసి
కాపలా కాస్తుంది.
తన ఆకల్ని పేగుల్లో చుట్టి చంద్రుణ్ణి కళ్ళల్లో చూపిస్తూ
గోరుముద్దలు తినిపిస్తుంది.
ఆడిన పాడిన, అల్లరిపనులు చేసినా
పండిన నేలలా చిద్విలాసం చిందిస్తుంది.
నాన్న తిట్టినా, కొట్టినా, సంతోషపెట్టినా

సంధ్య అంచుకు చేరిన సూర్యబింబంలా
తేటకళ్ళతో చూస్తూనే ఉంటుంది.
అమ్మ కళ్ళలో కన్నీళ్ళు, ఆనందబాష్పాలు
ఒక్కలాగే మెరుస్తాయి.
కాఫీలు తాగి కప్పులు అక్కడే పడేసినా
కంచాల్లో చేతులు కడుక్కులేచినా
వంతులు వేసి పని ఆపదు అమ్మ.
నల,భీమ పాకాలు అన్నారు కాని-
వంటయింట్లో అడుగుపెట్టే మగవారెందరు?
అమ్మ పెంచిన ఆడపిల్లలు
చదువు, సంధ్యలు నేర్చి ఉద్యోగాలు చేస్తున్నారు.
వంటలు, పిండివంటలు చేసి వంటకత్తెలవుతున్నారు.
పిల్లల్ని కని బాలింత లవుతున్నారు.
నిన్నటి అమ్మాయే ఈనాటి అమ్మ.
అమ్మ వంటిమీద చెమట బిందువులు
గృహానికి ముత్యాలసిరులు.
చెమటకు తడిసిన కుంకుమ కరిగి జారుతుంటే
ప్రేమరసం కరిగి కరిగి
గృహమంతా తడుపుతున్నట్లు ఉంటుంది.
అమ్మ చేతికి ఆసరా అందాలంటే
కాలం సంపూర్ణంగా ఊపిరి పీల్చాలంటే
అమ్మకు మరో అమ్మాయే కావాలి.

– ఆగస్టు, 1996

# జీవనరాగం

ఎత్తుగా, ఒత్తుగా పెరిగిన పచ్చని పంటచేలతో
గుంపులుగా పని చేస్తున్న ఆడకూలీల
రంగు రంగులచీరలు, రవికలు పాలపిట్టల్లా ఎగురుతున్నాయి.
రకరకాల పిట్టలూ, పిచుకలు
పంటగింజలను నోట కరవాలని కూనిరాగాలు తీస్తూ
పంటచేలను కోసే గాజుల గలగలలకు
శ్రుతులు కలుపుతూ కొత్తరాగం వినిపిస్తున్నాయి.
చుట్టూ గట్లపై పెరిగిన చెట్లు- పూలతో, కాయలతో
వంగి వంగి పంటకాలువలతో ఊసులాడుతున్నాయి.
చెట్లకొమ్మలకు కట్టిన ఊయలలోని పసిపిల్లలు
ఎగిరే పక్షుల పాటలతో కేరింతలు కొడుతున్నారు.
శ్రమకు పట్టిన చమటగుత్తులు చల్లగాలికి ఆరుతూ
పంటచేల కొత్తవాసనలతో కలిసి వింత వాసనలు విరజిమ్ముతున్నాయి.
వంకావాగు నిత్యం వారివెంటే కదులుతాయి.
కష్టంతో సగం కడుపు నిండుతున్నా
మిగిలిన సగం విచ్చుకున్న పంటచేలు నింపుతున్నాయి.
సూర్యచంద్రులు నిత్యం వారి గుడిసెల మీదుగానె
పయనిస్తూ మంచి చెడ్డలను తెలుసుకుంటాయి.
సూలింతలకు రుచిచూపించే చింతా, మామిడి
బాలింతలకు పథ్యంగా నిలుస్తాయి.
వారి శ్రమకు పల్లవించిన ప్రకృతి పంటపొలమై వారి వెంటే కదులుతుంది.
ఆడకూలీలని జీతం తక్కువిచ్చినా
పనిలో భేదం చూపని పసిడిమనస్సు వారిది.
రేపటి పొద్దులో ఆ భేదం కరిగిపోతుందనే కొండంత ఆశ.
నిత్యం కాలిబాటలో వారు వేసే అడుగులకు
పులకించిన నేల జీవనరాగం పాడుతుంది.

...15-1-95

# రిజర్వేషన్

ఆడపిల్లనైపుట్టి ఆటలు పాటలు నేర్చి
పచ్చని నేలంతా నాదేనని పరవశంతో పరుగులుపెట్టా!
రిజర్వేషన్ లిస్టు చూశాక తెలిసింది నాదంటూ ఏమీలేదని.
డీగ్రీలు చేతపట్టి న్యాయంకోసం వెతుకుతున్నా!
బస్సు ఎక్కి రిబర్వేషన్ సీటుకోసం
బిక్కుబిక్కుమంటూ వెతుకుతున్నా.
సీటాక్రమణ అయితే నిలబడిచూస్తున్నా!
తరతరాలుగా ఓట్లువేసి నాయకులకు మెజారిటీలు ఇప్పిస్తున్నాం.
మాకోసం సీట్లులేక బయటే నిలబడి బాగోగులు చూస్తున్నాం.
ఒకరిద్దరు కాబోలు వెనుక కుర్చీల క్రీనీడల్లో కనబడుతున్నారు.
మగవారి విజయాలకి ఆడువారే కారణమయితే
ఆడవారి విజయానికి కారణం మగవారే కావచ్చుగా!
ఇచ్చిపుచ్చుకోడాలు పాతయుగంనాటి నుంచి వస్తున్నవే!
దృఢమైన వెన్నెముకలు, బలమైన చేతికర్రలు లేకపోవచ్చు.
లేచి నిలబడి సిద్ధంగా ఉన్నామని సిగ్నలు ఇస్తే
పాలు పంచి యివ్వక తప్పదుకదా!
ఇల్లు చక్కపెట్టే తల్లికి అదేమంత అసాధ్యం!
మంచి మర్యాదల, నేర్పరితనం ఆడవారి ఆభరణాలయితే
దేశం ఇకపై వారిచేత సుభిక్షం కాదా!
రిజర్వేషన్ కొత్తకోణంలా రావాలి
అది అలవాటై శ్రమశక్తిలా నిలవాలి.

– అంతర్జాతీయ మహిళా దినోత్సవ సందర్భంగా... 8-3-97

# నాగుపాము

విషముక్క్రా నాగుపాము ఎదవిప్పి నవ్వుతుందా!
నవ్వుతున్నా విషం కక్కుతూ కస్సుబుస్సుమంటు
వెంటపడి తరుముతున్నట్లే ఉంటుంది.
తలవంచి నోరుమెదపకనోతే అప్పుడప్పుడు
వాటేసుకోవాలని యమపాశంలా కదులుతుంది.
పెత్తనం చెయ్యాలని ఎగిరి గంతేస్తుంది.
హాలులోకి వచ్చి బలవంతంగా వంటఇంట్లోకి తోలేస్తుంది.
గుప్పెడు చల్లగాలి కోసం వీధుల్లో కాలుపెడితే
తన అసలు రంగు బయటపడుతుందని
వెలుతురి నుంచి లాగి చీకట్లోకి నెట్టేస్తుంది.
స్తోత్రపాఠాలే నేర్వాలికాని అసలు పాఠాలు నిషేధం.
తలెత్తి నోరు తెరవకముందే కస్సున కాటేస్తుంది.
ఒకరు చనిపోతే కన్యాదానానికి క్యూలు కట్టే ఎందరో!
కర్ర చేతపడితే తరిమికొట్టడం ఎంతసేపు?
అయినా శిక్షించేవారికా, పడేవారికా శిక్ష?
ఒక కాలు బయట- మరోకాలు ఇంట్లో!
ఇద్దరినీ ఒకేసారి మేల్కొలపాలి.
సుప్రభాతాలు పనికి రావు! చింతనిప్పులు కావాలేమో!

... *15 జనవరి 199*(

# ఎర్రకోక

నిగనిగలాడె నలుపు అయినా
ఎర్రకోకలో ఆమె పూచిన తంగేడులా ఉంటుంది.
ఉభయసంధ్యల్లో ప్రకృతి ఆ చీరనే కట్టుకుని
లోకాన్నంతటిని పులకింపచేస్తుంది.

భర్త తిట్టినప్పుడు ఉబికే కన్నీళ్ళను ఎన్నిసార్లు
తుడిచి ఓదార్చిందో ఆ కొంగుమీది కాటుక మరకలే చెబుతాయి.
భర్త కొడితే చిట్లిన రక్తం మరకలతో
అర్ధకం పూలలా ఉంటుంది ఆ కొంగు.
చాకిరేవుకు వేసినా పోని జీవితపు మరకలవి.

పాదాలపైకి కట్టిన ఎర్రజీరలో రోడ్డుపైకి వచ్చినప్పుడు
వెంటపడే కోడిగాళ్ళను చూసి
ఒంటినిండా కొంగు కప్పుకుని నడిచిపోయే ఆమె-
ఆకాశంలోని సూర్యబింబం నేలకువచ్చి
నడిచిపోతున్నట్లు ఉంటుంది.
ఎరుపు రంగును చూసి ఆంబోతు రంకెలు వేస్తూ

కొమ్ములతో ఎత్తిపడేసినప్పుడు
సూర్యబింబాన్ని చిదిమినట్లు ఉంటుంది.

ఎర్రని కొంగుచాటున వంటివానికి పాలిస్తుంటే
ఆమె ముద్దమందారమై మెరుస్తుంది.
కొప్పునిండా తెల్లని మల్లెలు చుట్టి
రూపాయంత ఎర్రకుంకుమబొట్టు నుదుటపెట్టి
చేతులనిండా ఎర్రగాజులతో మగని వెంట
తిరునాళ్ళలో తిరిగే ఆమె- ఇలలో ఇంద్రధనస్సే.
ఆకలిపొట్టను, అరిగిన శరీరాన్ని ఎర్రకోక చాటున దాచుకుంటుంది.

భర్త చనిపోయాడని-
చిన్ననాడు తల్లి నీళ్ళుపోసి పెట్టిన బొట్టును
బలవంతంగా తుడిచేసి,
బాల్యం నుంచి చేతినిండా గలగలలాడుతూ
కష్టసుఖాలకు తోడుగాఉన్న గాజులు
బలవంతంగా పగులగొట్టి,
ఎర్రకోకను విప్పించి తెల్లచీరను మీద పడేసినప్పుడు...
జీవంపోయిన ఆమె-
పగటి చంద్రబింబంలా వెలవెలపోయింది..,
మోడైన తంగేడులా చిన్నబోయింది.

ఈ దురాచారాన్ని చూడలేని సూర్యుడు
పడమటి కొండలలో తలదాచుకున్నాడు.
ఆడవారి జీవితాలలో కొత్త పొద్దురావాలని
రేపటి కోసం ఎదురుచూస్తోంది లోకం.

... 10-1-9

# మంటలు - మంటలు

మంటలు మంటలు... ఆరని మంటలు.
దురాశల ముసుగుల్లో పెళపెళమంటున్న మంటలు...
దురాచారాల కౌగిట్లో తలదాచుకున్న మంటలు!
స్మశానంలో చితిమంటలు కావు-
వంటింట్లో హృదయాలను చీల్చే చావుకేకల మధ్య మంటలు...
ప్రాణమున్న శరీరాన్ని శవంగా మారుస్తున్న మంటలు!

భయంకరాకారులైన రాక్షసులు కారువీరు.
నాగరికతా వేషభాషలతో మానవులుగా నటిస్తున్న
క్రూరమృగ ప్రవృత్తితో మసలే నరరూపరాక్షసులు.
చట్టాల పగ్గాలను అవలీలగా దాటగల సమర్థులు.

గాలం వేస్తారు కట్నం కోసం.
పెద్దల మాట జవదాటని తనయుడు.
పసుపుపారాణి అరకముందే ఆకలి తీర్చుకోడానికి
ఇంటికోడలు ఆహుతి.
కరడు కట్టిన ధనదాహ పిశాచి

కోరలు విప్పి నములుతోంది.
పచ్చని లేతశరీరం కాలిబొగ్గవుతోంది.
చావుకేకలు ఎవరికీ వినపడవు.
అత్త, మామ, భర్త... భేదాలు లేవు- అందరూ ఏకమే!

వంటింట్లో వంటరి పోరాటం-
స్త్రీ జాతికే సిగ్గుచేటు.
నాగరికతా ప్రపంచం తలవంచుకునే దుస్థితి.
పట్టుబడితే దొంగల్లా జైలు శిక్షలు.
శిక్ష తగ్గించుకొనే దొడ్డిదారులు ఎన్నో!

ఎందరో ఇంటి కోడళ్ళు, ఎన్నో చితిమంటలు.
శవాలుగ మారడానికే పుట్టిన జీవులు.
ఆకలి మంటలు కావు- అవమానపు మంటలు కావు.
ఇళ్ళ దహనాలు కావు- కోడళ్ళ దహనాలు.
మంటలు మంటలు..!

సహనం వదలండి మహిళల్లారా!
మంటలు చల్లారే మార్గం చూపండి.
కాలమేఘాలై కదిలే విధం చూడండి.
అందరూ ఏకమై పెనుతుఫానై కదలండి.
వరదై పొంగిరండి.
దురాచారాన్ని ముంచెత్తండి.

... 15-8-9

# ఏమి న్యాయం?

కట్నం కోసం, లాంఛనాలకోసం
పెళ్ళిపీటల మీదే పేచీలు.
కుటుంబ భారంతో నడుంవంగిన
మధ్య తరగతి కుటుంబీకులు
అంతకంటె మర్యాదలేమి చెయ్యగలరు!
భూదేవి అంత మండపం, ఆకాశమంత పందిరివేసి
ఆర్భాటంగా పెళ్ళి చెయ్యగలరా!
తాహతుకు మించినా, తల ఎక్కడో తాకట్టుపెట్టి
జీవితాంతం తీర్చుకోలేని ఋణం మోస్తూ
చేస్తాడు పెళ్ళి పనులు.
అమ్మాయి అత్తవారింటికెడితే అదేచాలు.
ఆచారమే గ్రహచారమై అప్పుల ఊబిలో
దిగబడి లేవలేక తన్నుకుంటున్న తల్లిదండ్రులు.
వియ్యాలవారికి చెలగాటం- కన్యాదాతలకు ప్రాణసంకటం
అమ్మాయి అత్తవారింటి కెళ్ళిందని సంతోషం మూడునాళ్ళే.
నాలుగోనాడు మరో కొత్త కోరిక.
కొత్త కోడలిని తిట్టి, తన్ని, మాడ్చి నరకయాతనలు.

ఒక కోడలు చస్తే మరో కోడలు-
భారతదేశంలో ఆడపిల్లల కేమికొరత?
ఒక ఆడపిల్ల బలైపోతే సానుభూతి ఎవరికి?
కన్న కడుపులు కాలి మంచంపట్టిన తల్లితండ్రులు
భార్యను చంపిన మగవాడు మరునాడె పెళ్ళికొడుకు.
ఎవరి అవసరాలు వారివి.
ఎవరి కడుపు ఆకలి వారిది. ఎవరి పెళ్ళిసందడి వారిది.
రెండవ పెళ్ళి అయినా కావలసింది కట్నం.
కన్యనివ్వడమేకాదు.., కట్నమివ్వడానికే క్యూలో జనం-
కట్నం చాలలేదని కొండంత నెపంతో పుట్టింటికి నెట్టినా!
మరో పిల్లకేమి బాధ! కావలిసింది కాపురం- భర్త.
కట్నంపోసి రెండవపెళ్ళి వాడినైనా కొనుక్కుంటున్నారు.
ఏమి న్యాయమిది? తప్పు- ఇచ్చే వారిదా?
పుచ్చుకునేవారిదా?
మనసుంటే ఆలోచించాలి.
మానవత్వముంటే అబలను ఆదుకోవాలి.
ధైర్యముంటే తిరగబడాలి.

... 10-9

# ఇంకెన్నాళ్ళు..?

ఎన్నాళ్ళు ఈ ఉక్కిరిబిక్కిరి
వంటింట్లో శ్వాస ఆడక, పడకగదిలో శ్వాస అందక
నడిరోడ్డులో శ్వాస వదలలేక
ఎన్నాళ్ళు ఈ నరకం- ఇంకెన్నాళ్ళు ఈ భయం?
వంటింట్లో కట్నంకోసం హత్యలు.
భర్త కౌగిలిలో ఉరితాడులు- మరో ఆడదాని కోసం అగచాట్లు!
ఒంటరిగా ఇంట్లో ఉంటే
మానభంగాల భయం!
అర్ధరాత్రి కాదు, పట్టపగలే ఆడపిల్లకు
నడిరోడ్డులోనే రేపుల భయం!
కామం పశువై ప్రవర్తిస్తోంది.
అక్క, చెల్లి, అమ్మ వావి వరుసలు లేవు!
వయసు తేడాలు లేవు!
ఆకాశం వెరచి చూస్తోంది.
భూమి ఆక్రోశిస్తోంది.
ఊపిరి బిగబట్టి ఆడపిల్ల బతుకుతోంది.
కాళ్ళు వణుకుతుంటే

అంతరంతరాలలోని ధైర్యాన్ని చేదుకుంటోంది.
కరడుకట్టిన భయంతో మానవత్వం మంచుకొండలో
తలదాచుకొని చల్లబడుతోంది.
అయినవారు కూడా ఆమడదూరం!
చీకటి తెరను దించుతాడు సూర్యుడు-
భయం తెరను దింపేదెవరు?
చట్టాలు, సంరక్షణలు, కాపలాలు కళ్ళు మూసుకున్నాయి.
అయినా క్షణ జీవితం కోసం ఆరాటం!
కాళ్ళు, చేతులు, కళ్ళు అన్నీ ఉన్నాయి.
రెక్కలు తెగిన పక్షులం కాదు.
కాళ్ళు లేని కుంటివారం కాదు.
కళ్ళు లేని కబోదులం కాదు.
ఇంకెన్నాళ్ళు? మన రక్షణకు మనమే ఉద్యమించాలి.
ధైర్యమే కవచంగా నిలుపుకోవాలి.
అంతా ఏకమై చేతులు కలపాలి.
ఎదురొచ్చిన వారు కదపలేని
మేరు శిఖరాలు కావాలి.
ఇంకెన్నాళ్ళు ఈ అన్యాయాలు?
రూపమెత్తిన చైతన్యం
వరదలా పొంగి వస్తోంది.

... 5-9-92

# మేలుకొలుపు

సూర్యుడు నేలకు దిగినట్లు భరించలేని ఎండ.
చల్లని నేలతల్లి మండే ఇనుపచాప
తడారిపోయే జీవులు.
తల్లడిల్లే ప్రాణాలు.
బండరాళ్ళు పగులుతున్న శబ్దాలు!
పగులగొట్టేది ఎండవేడి కాదు.
కటికనేలమీద కూర్చుని గాజుల చేతులే
ఎండ, వానలు వారికి నేస్తాలు.
రోళ్ళుకు, తిరుగళ్ళుకు రూపాలిస్తున్నాయి.
అవి ఇనుప చేతులు కావు!
కొట్టి కొట్టి కాయలు కాసిన చేతులు.
పట్టె గొడ్డుకారపు కూడుతిని
అవధులు పెంచుకున్న చేతులు.
పాతగిల్లిన చీరలలో బక్కచిక్కిన దేహాలు.
ఎముకల వలమేతప్పు మాంసములేని శరీరం
చెమటకాయలే పూసల పేరులు.
ఎండ శరీరాన్ని మాడుస్తోంది.

విద్య నేర్చిన వివేకవతినై
ఆర్థిక పుష్టినొందిన ఉద్యోగినిగా
బతుకుతెరువును నేర్చుకోవాలని వుంది.
ప్రపంచ జ్ఞానమంతా మూటకట్టుకోవాలని వుంది.
అసెంబ్లీ, పార్లమెంటుల్లో అడుగుపెట్టి
చట్టాలను సవరించి, అన్యాయాన్ని ఉరితీసి
దేశంలో కొత్త సంస్కారం విరజిమ్మాలని వుంది.
సిపాయినై తుపాకి చేతపట్టి
దేశరక్షణకు సమిధను కావాలని వుంది.
ఆకాశంలోని నక్షత్రాలను నేలకు దింపి
చీకటి బతుకుల్లో వెలుగులు నింపాలని వుంది.
అమ్మల్లారా! అక్కల్లారా! అన్నల్లారా! తండ్రుల్లారా!
మామల్లారా! అత్తల్లారా!
పచ్చనిచెట్టులా పెరుగుతున్న నన్ను
రెక్కలు విరిచి చీమునెత్తురు లేకుండా
విరిచి ముక్కలు చేయకండీ!
పూర్ణమ్మ, స్నేహలతాదేవిల్లా
నన్ను బలికానివ్వకండీ!
సమాజం బడిలో నిండుగా పెరగాలని ఉంది.
ఆకాశంలో కదిలే నీలిమేఘంలా వర్షించి
ఈ నేలపై పుట్టినందుకు
నా ఋణం తీర్చుకోవాలని ఉంది.
నా యీ చిన్న ప్రయత్నానికి
నాతో చేతులు కలపండి!
మీతో అడుగులు వేస్తూ
మీ మధ్యలో నాకు నడవాలని వుంది.
మాతృభూమిని కొలుస్తూ
నాకు బతకాలని ఉంది.

... 12-2-9

# ఇక తమస్సులుండవు

తరతరాల దురాచారాల వడిలో
తలవంచిన ఓ మహిళా!
ఇకనైనా తలెత్తి చూడు!
తూర్పు వాకిట కిరణరాశై
కదలుచున్నది చైతన్యరథం.

ఒకనాడు భర్తతోటె బతుకని
భర్తలేనినాడు మరణమే మేలని
నిన్ను జీవంలేని చాపలా చుట్టచుట్టి
విసిరారు చితిపైకి.
కదలకుండా కొరకంచులతో పొడిచి
బూడిద చేశారు.
నీ బతుకు భారమై కాలగర్భంలో కలిసింది.
నిలిచింది నగ్నసత్యంగా
భారత మహిళల చరిత్ర పుటల్లో.
ముక్కుపచ్చలారని లేతవయసులో
ఎద్దులా, గానుగెద్దులా ముక్కుకు తాడువేసి

తలనువంచి, నగలతో మెడలునింపి
అస్తమించే సూర్యుని నమ్మి
మూడుకాళ్ళ ముసలికి
జీవితభాగస్వామిని చేసి
అతని వెంట నడిపించారు.
నీ వయసునే కాలరాసి
నీ మనసునే నేలరాసి
నీ బతుకునే సమాధి చేశారు.

వరకట్నానికి బలిపశువును చేసి
చిగురులు తొడిగి పుష్పించే నీ జీవితాన్ని
మొగ్గలోనె తుంచేస్తూ
తలంబ్రాలు తలపై జారకుండానె
బూడిదచేసి ఏటిలో కలిపేస్తున్నారు.
అత్తమామలు కారు వారు-
రాక్షస సంతతి వారె!
ప్రణయాన్ని పంచి వెన్నెల పాన్పుపై
మురిపించే భర్త కాదు-
వాడుత్తి ధనపిశాచి!
తల్లితండ్రులు కారు వారు-
దానం చేసిన పుణ్యదాహులు వారు!
అత్తింటి బాధలు విన
చెవిని ఇచ్చువారు కాదు!
వాస్తవాలను గొంతుదాటి రా
నిచ్చగించువారు కాదు.
వారికి పరువే ముఖ్యం-
సమాజానికి నటనే ముఖ్యం!

నీ అందం, నీ చందం దోచుకోడానికి
కాచుకుని ఉంటారు కామాంధులు కొందరు.

ఆఫీసుల్లో విసరుతున్న ఎరలు-
నడిరోడ్డులో నిలుపుతున్న చెరలు!
నయవంచనలు, మానభంగాలు-
చట్టం చేతుల్లో తారుమారులు!
నమ్మకు ఈ లోకంలో ఎవరినీ-
అందరూ నిన్ను వంచించ యత్నించువారే!
నీపై పెత్తనం చెలాయించువారే!

ఆనాటి మహానుభావులు
దురాచార నిర్మూలనా శ్రామికులు
రాజా రామమోహను రాయలు
వీరుశలింగం పంతులూ, గురజాడలు
మహాత్మాగాంధీలు ఈనాడు ఏరీ?
ఎక్కడో ఒక్కరూ-అరా ఉన్నా
ఆనాటి చైతన్యమేది?
దురాచారాలే పడగలెత్తి
ఏలుతున్నాయి సమాజాన్ని!

అయినా తూర్పు వాకిట కదులుతోంది...
ఆపలేని మహిళా చైతన్యం-
పగులుచున్నది దురాచార భూగర్భం!
ఇకపై సాగవు బలిపూజలు.
ధనకాంక్షల దహనాలు.
పుణ్యకాంక్షల యాగాలు.
అగ్ని చుట్టూ నటనల ప్రదక్షిణాలు.

మ్రోగుచున్నది గుండెలదర
స్వేచ్ఛా శంఖారావం-
దద్దరిల్లుచున్నది భూమండలం!
దురాచారాల వేరులను దున్నుకుంటూ

రక్త దాహాలను తన్నుకుంటూ
పడగలెత్తిన ఉషస్సులను కలుపుకుంటూ
నారీలోకాన్ని నడుపుకుంటూ
అమాయకత్వాన్ని మాపుకుంటూ
మంచితనాన్ని పెంచుకుంటూ
గుండె నిబ్బరమే చక్రాలుగా
ధైర్యమే పగ్గాలుగా
కదులుతోంది చైతన్యరథం!
ఇకపై వారి బతుకుల్లో
తమస్సులుండవు-
ఉషస్సులే కాని!

... 2-2-9

# కొత్తగాలి

వీస్తోంది కొత్తగాలి
జీవితపు పుటలను తిరగేస్తూ
వెతల చరితలను తలపోస్తూ
మూగబాధలను ఎత్తిపోస్తూ
ప్రచండ మారుతమై వీస్తోంది.

వేళ్ళతో పాదుకున్న విషవృక్షాల
తలలు తెంచుకుంటూ
ముళ్ళ కొమ్మలు విరుచుకుంటూ
నాదే తరుణమని
పెనుగాలై వీస్తోంది.

బూజు పట్టిన కులాచారాల
గూడులు దులుపుకుంటూ
చెదలు పట్టిన మూఢాచారాలు
తవ్వి చదును చేస్తూ
ప్రళయరూపమై వీస్తోంది.

ఇక ఆగదు ఈ నేలపై అనాచారం.
ఇక సాగదు ఈ నేలపై దురాచారం.
ఆశలన్నీ చిగురించే సమయమిది.
అవకాశాలన్నీ మోసులెత్తే సమయమిది.
కొత్త యుగానికి శభారంభమిది.

... జనవరి 1995

# నిత్య వసంతం

ఎప్పుడో వంచిన తలలో
తలెత్తిన భావ పరంపరలు.
ఎప్పుడో బిగపట్టిన పెదవులలో
గుసగుసలాడె కొత్తమాటల పదునులు.
వంగిన నడుముతో
నిటారైన చైతన్యదీప్తి.
తడబడే అడుగులలో
కదంతొక్కే నూత్న స్ఫూర్తి.
మొద్దుబారిన మెదడులో
ఆలోచన మొలకెత్తితే
అది రగలక మానదు.
అమాయకత్వమే తెలివికి నాందియై
మంచితనమే సంస్కారానికి దోసిలియై
వెలుగుబాటలో సుస్థిరమై సాగుతుంది.
అప్పుడే లోకంలో కొత్త ఉగాది.
నారీ జీవితాలలో నిత్య వసంతం!

... ఫి(

# నా మహిళ

శరత్కాలాన ఘుమఘుమా పొంగు
శశిరేఖ తళుకుల బెళుకు నా మహిళ-
హిమాద్రి శిఖరాగ్రి నుండి జలజలా పారు
గంగా సముత్తుంగ తరంగ విభ్రమ లావణ్య నా మహిళ!
మలయమారుతా వీచికా శీతల సౌరభగంధి
సుప్రభాత సముజ్జ్వల సూర్యకిరణ సౌందర్యరాశి నా మహిళ-
చంద్రోదయ వేళ పాలసంద్రపు ఉత్తుంగ తరంగ విన్యాస విభ్రమం
వసంత పుష్పమాలికా సౌందర్య రసోదయం నా మహిళ!

వేద వేదాంగాలలో పుణ్యరాశియై
పురాణేతిహాసాలలో పూజనీయయై
వాల్మీకి గంటాన రామాయణ మహాకావ్యమై
వ్యాసుని గ్రంథాన మహాభారత సంహితయై
భారతీయ హృదయ తాండవమూర్తియై నిలిచింది నా మహిళ!

కాళిదాసు కవనాన శృంగార మూర్తియై
భవభూతి రూపకాన కరుణరస విభ్రాంతియై
పాఠకావళి హృదయతంత్రులను మీటింది నా మహిళ!

కవిత్రయ కవనాన జేగంటలలో
కుంతియై, ద్రౌపదియై, శకుంతలయై
ఆంధ్ర సాహితి ప్రాంగణాన అలికి ముగ్గులు వేసేది నా మహిళ!

రంగనాధ భాస్కరులు కావ్య సిరులలో
తెలుగింటి పడతియై వెలిగింది సీతామహాసాధ్వి.

కవిసార్వభౌమ శ్రీనాధ మహాకవి
కనకాభిషేకాలలో నిషధరాణియై
విజయధ్వానాలు మ్రోగించింది నా మహిళ!

ఒకచేత హలము, ఒకచేత గంటము పట్టి
తేనెలు చిందించిన పోతన తెలుగుకావ్యంలో
మధురభక్తిని గుమ్మరించిన రాధమ్మ-
శృంగారభక్తిని ఒలికించిన రుక్మిణమ్మ-
ఒయ్యారాలు చిందించిన వీరశృంగార నాయిక
సత్యభామ... నా మహిళలు!

వీర నాయక హృదయరాణియై
సంగీత, నాట్య, చిత్రకళా రాణియై
కృష్ణరాయల కొలువున ప్రబంధరాణియై వెలిగింది నా మహిళ.

శాస్త్ర పాండిత్య సాహితీమూర్తుల సరసన
గంటంబు చేతపట్టి కవనాలు పలికించి
గ్రంధకర్తలుగ సాహితీలోకాన నిలిచిన
తిమ్మక్క, మొల్ల, రంగాజమ్మ, మధురవాణులు నా మహిళలు!

పురుషవేషాన మగధీరుడై
వాత్సల్యాన స్త్రీమూర్తియై
శత్రురాజుల పాలిటి రౌద్రియై

కదనరంగాన నిప్పులు కురిపించిన రుద్రమ్మ-
కాకతి రుద్రమదేవి నా మహిళ!

ఒకచేత కరవాలము
ఒకచేత అశ్వనాళము పట్టి
పసివాణ్ణి వీపునే కట్టి
పరాయి పాలకుల గుండెలలో బాకులు దింపి
యుద్ధం నెరపిన విప్లవసింహం
వీర నారీమణి ఝాన్సీరాణి నా మహిళ!

భారత స్వాతంత్రోద్యమ మహాసంగ్రామంలో
సమిధయ్యై, మహాత్మునికి కుడిభుజమ్మై
మధుర కవితాగాన మూర్తియ్యై వెలిగిన
భారతకోకిల సరోజినీనాయుడూ-
మహిళల పాలిటి సేవామూర్తియ్యై
అనాధ స్త్రీలకు ఆంధ్ర మహిళాసభయ్యై
దేశసేవకు ఉద్యమస్ఫూర్తియ్యై ప్రజ్వలించిన
దుర్గాబాయమ్మా... నా మహిళలు!

ఒక చెంప రాజకీయాన్ని
ఒక చెంప దేశాభ్యుదయాన్ని నిలిపి
భారతదేశ పాలన చేసిన సాహసమూర్తి
నాయికామణి ఇందిరామణి నా మహిళ!

పట్టాగొలుసుల పారాణులు పెట్టి
పాదాలకు బూట్లు తొడిగి, హస్తాలతో బేడీలు పట్టి
దొరలనక దొంగలనక
దుష్టులను దండించే పోలీసాఫీసరు
రూపం ధరించిన ధైర్యం... నా మహిళ!

తుపాకులు పేల్చుటలో, విమానాలు నడుపుటలో
అంతరిక్షయానంలో అందెవేసిన చేయి నా మహిళ!

సాహితీ పాఠకులను ఉర్రూతలూగించిన
సాహితీరాణి నా మహిళ!
తేనెలొలుకు తీయని తెలుగురాణి
నవరస నాట్యభంగిమలలో
సుధారసంబు చిందించు శిల్పసుందరి
గానకళా రసమయ మనోహర సౌగంధి
అపురూప చిత్రకళా ముగ్ధరూపి
అసాధారణ హృదయసౌందర్య కళారాజ్ఞి నా మహిళ!

– *వనిత... మే 1993*

# డా: వాసా ప్రభావతి

ఎమ్.ఏ., పి.హెచ్.డి.

డా: వాసా ప్రభావతి తూర్పుగోదావరి జిల్లా ఆత్రేయ పురంలో భారత స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించిన దేశభక్తుల కుటుంబంలో జన్మించారు. ఇంటర్ వరకు ఆ పల్లెలోనే చదువుకుని, వివాహమైన తరువాత హైదరాబాదులో బి.ఎ., ఎమ్.ఏ.(తెలుగు) 'ఆంధ్ర సాహిత్యములో హరిశ్చంద్రోపాఖ్యానము' అనే అంశంపై పి.హెచ్.డి., లింగ్విస్టిక్స్‌లో పి.జి. డిప్లొమా ఉస్మానియా యూనివర్శిటీలో చేశారు.

సరోజినీనాయుడు వనితా మహావిద్యాలయంలో రీడర్‌గా, తెలుగు శాఖాధిపతిగా పనిచేసి ఇటీవలే పదవీ విరమణ చేసి ఉత్తమ ఉపాధ్యాయినిగా, మహావక్తగా పేరుగడించారు.

ఒక రచయిత్రిగా, కవయిత్రిగా సుమారు 50 పుస్తకాలు రచించి అనేక అవార్డులు, సన్మానాలు, సత్కారాలు అందుకున్నారు. అనేక కవి సమ్మేళనాలలో, జాతీయ, అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొని పేరు గడించారు.

ఈమె రచనలు... కవిత, కథ, నవల, వ్యాసం, నాటకం మొదలైనవి దిన, వార, మాస, త్రైమాసిక పత్రికలలో ప్రచురించబడి, హిందీ, కన్నడ, తమిళ, ఇంగ్లీషు భాషలలోకి కూడా అనువదించబడ్డాయి. ఈమె రచనల్లో 2 కవితాసంపుటాలు, నవలలు, 3 మినీ నవలలు, 3 నాటకాలు ప్రసిద్ధిచెందాయి.

'వెండి వెలుగులు, ప్రేమ బంధం' మొదలైన నవలలు, 'బిచ్చగత్తె, నాన్న కావాలి, న్యాయం గుడ్డిది, వీధి దీపాలు' మొదలైన కథలకు బహుమతులు, 'రష్యాలో స్నేహయాత్ర, అమెరికాలో తెలుగు మహిళలు, స్వాతంత్ర్యోద్యమంలో తెలుగు మహిళలు' మొదలైన గ్రంథాలు, 'దేశ బాంధవి, స్వాంతంత్ర్యోద్యమంలో దువ్వూరి సుబ్బమ్మ చరిత్రపై నాటకం, బిచ్చకత్తె' మొదలైన నాటికలు మంచిపేరును సంపాదించిపెట్టాయి.

చిన్నతనం నుంచి కవిత్వం రాయడం అలవోకగా అలవాటు అయింది. స్కూలు మాగ్‌జైనులోనే కవితలు వచ్చాయి.

'అమ్మ, ఆలాపన, జగతి– ప్రగతి, మానవతా శిఖరం, మంజీర నాదాలు, మళ్ళీ మళ్ళీ పుడతా.., హృదయ నేత్రం (కవితా కావ్యం)' సాహితీవేత్తల, అభిమానుల మన్ననలు అందుకున్నాయి. వేదికలపై అనేక కవి సమ్మేళనాలలోనే కాకుండా– రేడియో, టీ.వీ. కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉగాది వేడుకలలో అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి రామారావుగారి చేత, ఇప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారి చేత అనేకమార్లు సత్కారాలు అందుకున్నారు. జాతీయ కవి సమ్మేళనంలో పాల్గొన్నారు కూడా.

అనేక కవితలకు, 'హృదయనేత్రం' కవితాసంపుటికి బహుమతులు అందుకున్నారు. 'దేశ బాంధవి' ఉత్తమ నాటకంగా అవార్డు పొందింది.

ఉస్మానియా యూనివర్శిటీ బోర్డాఫ్ స్టడీస్ మెంబరుగా, 12 సంవత్సరాలు సెన్సార్ బోర్డు మెంబరుగా పనిచేసి ఉత్తమ విమర్శకురాలిగా పేరు గడించారు.

మైసూరు యూనివర్శిటీలో 1990-1993 వరకు 'సంఘం చేసిన బిక్షుకి, న్యాయం గుడ్డిది' గ్రంథాలు బి.ఏ., బి.ఇడి.వారికి పాఠ్య గ్రంథాలుగా ఉన్నాయి.

'మద్రాసు గృహలక్ష్మి కంకణ అవార్డు, తెలుగు యూనివర్శిటీ ఉత్తమ రచయిత్రి ఎండోమెంటు అవార్డు, రచయిత్రి ఉత్తమ గ్రంథం సాహితీ అవార్డు, 2001 ప్రతిష్టాత్మకమైన సుశీలా నారాయణ రెడ్డి అవార్డు' లభించాయి.

ఇవేగాక, 'మద్రాసు యునైటెడ్ రైటర్స్ అసోసియేషన్ లైఫ్ ఎచీవ్‌మెంటు అవార్డు, మద్రాసు తెలుగు అకాడమీ పురస్కారం, ఢిల్లీ తెలుగు అకాడమీ పురస్కారం, బొంబాయి ఆంధ్ర మహాసభ సత్కారం, రాగ సప్తస్వరం బంగారు కంకణం, వంశీ ఆర్ట్ థియేటర్స్‌వారి బంగారు పతకం, పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి సాహితీ అవార్డు, జ్యోతి మహిళా మండలి పంచరత్న మహిళా అవార్డు, తారా కల్చరల్ అసోసియేషన్ మహిళా అవార్డు...' ఇంకా అనేక అవార్డులు, సన్మానాలు, సత్కారాలు లభించాయి.

అఖిల భారత భాషా సాహిత్య సమ్మేళన వారిచే 'సాహిత్య శ్రీ, భారత భూషణ్' బిరుదులు.., ఇవేగాక- 'సాహిత్య శిరోమణి, సాహితీ సరస్వతి, అక్షర కంఠీరవ' బిరుదులు లభించాయి.





# MALLY MALLY PUDATHAA

by

DR. VASA PRABHAVATHI

రంగూ రూపూ భేదాలు తెలియక
ప్రేమను రంగరించి పోసే మాతృమూర్తిని నేను
దేశ సమైక్యతా రథానికి
ఎగురవేసిన జెండాను నేను. .................. మంజీరనాదాలు

ద్వేషం మనిషిలో దాగున్న అగ్నిశిఖ
మానవత్వం మనసులో వెలిగే దీపశిఖ! ................ మానవతా శిఖరం

తండ్రిని కూడా పరిచయం చేసేది తల్లే. .......................... అమ్మ

అమ్మ వంటిమీది చెమట బిందువులు
స్నేహానికి ముత్యాల సిరులు. ............... మళ్ళ మళ్ళీ పుడతా!

నా కంటి వైశాల్యం అరంగుళమైనా
నా చూపు వైశాల్యం ఈ దేశాన్ని కొలిచే ఆకాశమంత. .......... హృదయనేత్రం

స్వరాజ్యం అర్ధరాత్రి వచ్చింది కదా
అందుకే ఆ వ[illegible]ని పిల్ల
బతుకు వాకిటిలో
ఇంకా తెల్లవారలేదు. ............... మళ్ళీ మళ్ళీ పుడతా

హృదయాన్ని ఇచ్చిపుచ్చుకునే ప్రియుని చేయిపట్టి
రెప్పపాటంత జీవితకాలంలో
తోసిల్లతో ఆనందం పొందుకోవాలని ఉంది ............ మళ్ళీ మళ్ళీ పుడతా!

పునర్జన్మంటూ ఉంటే
మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా. ............ మళ్ళీ మళ్ళీ పుడతా!